# పితృ తర్పణ విధి

## (యజ్ఞోపవీత ధారణ విధాన సహితం)





హిందూ ధర్మచక్రం స్వచ్ఛంద ధార్మిక సేవా సమితి

(రి.నం. 579 / 2020)

హైదరాబాదు



## అంకితం :

**మా ఇలవేల్పు శ్రీ గంగా సహిత ఉమామహేశ్వర స్వామి పాదపద్మములకు మంజీర బ్యారేజి సంగారెడ్డి**

## రచయిత పరిచయం

| | | |
|---|---|---|
| పేరు | : | మద్దికుంట శ్రీకాంత్ శర్మ |
| తల్లిదండ్రులు | : | కీ॥శే॥ బ్రహ్మశ్రీ మద్దికుంట వెంకటేశ్వర శర్మ, శ్రీమతి రాజేశ్వరి గార్లు |
| స్వస్థలం | : | సంగారెడ్డి తెలంగాణ రాష్ట్రం |
| విద్యాగురువు | : | కీ॥శే॥ మంచినీళ్ల పాండురంగ శర్మగారు, కొమరవెల్లి దేవస్థాన వేదపండితులు |
| భార్య | : | శ్రీమతి శ్రీవాణి |
| కూతుర్లు | : | చి॥ శ్రీకరి, చి॥ శ్రీకృతి |
| వృత్తి | : | వైదికము, వ్యాఖ్యానాలు |
| ప్రవృత్తి | : | హిందూ ధర్మచక్రం ద్వారా సనాతన ధర్మ ప్రచారం |
| నివాసం | : | మల్లాపూర్, హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం, సెల్ : 9849485645 |





## మద్దికుంట శ్రీకాంత్ శర్మ

**హిందూ ధర్మచక్రం వ్యవస్థాపకులు**

**హైదరాబాద్.**





## హిందూ ధర్మచక్రం స్వచ్ఛంద ధార్మిక సేవా సమితి

(రి.నం. 579 / 2020)

హైదరాబాద్

# పితృ తర్పణ విధి

(యజ్ఞోపవీత ధారణ విధాన సహితం)

సంకలనం : **మద్దికుంట శ్రీకాంత్ శర్మ,**
మల్లాపూర్, హైదరాబాద్.
Cell : 9849485645

ప్రథమ ముద్రణ : శ్రీ శార్వరి, మాఘం
మార్చి, 2021
కాపీలు : 1000

వెల : రూ. 55/-

ప్రతులకు:

1. **"హిందూ ధర్మచక్రం స్వచ్ఛంద ధార్మిక సేవా సమితి"**
రి.నెం. 579/2020
మల్లాపూర్, హైదరాబాద్.
సెల్ : 9849485645

2. **దాచేపల్లి**
**డి.వి. కృష్ణ బుక్ డిపో**
7-1-669/1,
మెండా మార్కెట్, సికింద్రాబాద్ - 500 003.
ఫోన్ : 040-27704770

ముద్రణ :
**సిరి ఎంటర్‌ప్రైజెస్**
హైదరాబాద్.
సెల్: 92465 20375

॥ ఆశీరనుగ్రహం ॥

**శ్రీ విద్యాశంకర**






శ్రీ శ్రీకాంత శర్మకు నారాయణ స్మరణ పూర్వక ఆశీర్వాదములు. తమరు సంకలనము చేసి పంపిన నిత్య పితృతర్పణ పుస్తకము చూసినాము బాగున్నది. భారతీయ (హిందూ) ధర్మములో దేవ ఋణము, పితృఋణము, ఋషి ఋణము విశేషము. అందున పితృ ఋణము చాలా ముఖ్యమైనది. జన్మనిచ్చిన తల్లిదండ్రులు ప్రథమ గురువులు. వారి ఋణము తీర్చుకొనుట అసంభవము. కనీసము వారికి జీవితకాలము సేవ చేయుట మరియు తదనంతరము శ్రాద్ధము, తర్పణముల ద్వారా వారి ఋణము కొంత వరకు మనము తీర్చుకోగలము.

ఆధునిక యాంత్రిక యుగము, పాశ్చాత్య సంస్కృతి ప్రభావముతో నేటి ప్రజలు భారతీయ సంస్కృతికి దూరమవుతున్నారు. దీనికి కారణము పెద్దలు వారికి అవగాహన కల్పించకపోవటము మరియు వారు ఆచరించకపోవటము.

తమరు సంకలనము చేసిన పితృ తర్పణ విధి పుస్తకము సామాన్య ప్రజలకు చాలా ఉపయోగకరముగా ఉన్నది. దీని ద్వారా కొంత వరకైనా తల్లిదండ్రులకు ఋణము ఇలా తీర్చుకోవచ్చునని మా విశ్వాసము.

తమరికి మరియు ఈ పుస్తకము సమాజమునకు అందించుటకు సహాయ సహకారములు అందించిన వారందరికీ, హంపి క్షేత్రాధిపతి శ్రీ విరూపాక్ష స్వామి, శ్రీ పంపాదేవీ అమ్మవారు, శ్రీ భువనేశ్వరీ దేవి ఆయుః ఆరోగ్య ఐశ్వర్యములతో పాటు మంచి జ్ఞానాన్ని ప్రసాదించమని ప్రార్థించుచున్నాము.

ఇతి నారాయణ స్మరణం

**శివ విద్యారణ్య స్వామి**

జయ హనుమన్

## ముందుమాట



డా॥ అన్నదానం చిదంబర శాస్త్రి
సెల్ : 9848666973

శ్రీ మద్దికుంట శ్రీకాంత్ శర్మ గారు గొప్ప ధర్మ జిజ్ఞాస కలవారు. తాము తెలిసికొని ఆచరించటానికి పరిమితం కాక 'స్వయం తీర్త్వా పరాన్ తారయేత్' అన్నట్లు తోటివారిని కూడా తరింపచేయాలనే తపన కలవారు. హిందూ ధర్మచక్రమనే స్వచ్ఛంద ధార్మిక సంస్థ నెలకొల్పి దానిద్వారా బహుముఖంగా ధర్మప్రచారం చేస్తున్నారు. షష్టిపూర్తి వంటి శాంతి కలాపముల గూర్చి విపులంగా తెలియజేసిన వారు ఇప్పుడు 'పితృతర్పణం' అనే పేర ఇలా సమాజోపయోగకరమయిన మంచి గ్రంథం వెలువరించటం అభినందింపదగిన విషయం. గ్రంథాలు చాలా మంది వ్రాస్తారు. కానీ పితృపూజా విధులు తెల్పేవారు తక్కువ. ఆలోటు కొంత భర్తీ చేస్తున్నారు శ్రీకాంత్ శర్మగారు.

"పితృకార్యం విశిష్యతే" అని దైవకార్యం కంటే పితృకార్యం విశేషంగా చెప్పబడింది. వారి స్థానం కూడా అట్టిది. పితృదేవతల స్థానం సర్వోపరి స్థానం. అందుకే దైవకార్యం కంటే దానికి ప్రాధాన్యం. సృష్టిలో కారణ వైకుంఠానికి పైన మహా కైలాసం, దానిపైన శ్రీనగరం, దానిపైన కారణ బ్రహ్మలోకం ఉంటాయి. ఆ పైన ఉండే త్రిఖండ సోపానంలో వసు, రుద్ర, ఆదిత్య స్థానాలు పితృస్థానాలు ఉంటాయంటే పితృదేవతల విశిష్టత ఎట్టిదో గ్రహింపగలం. అందుకే ఆ పితృ కార్యాలు ఎంతో శ్రద్ధగా చేయాలి. అప్పడే అవి శ్రాద్ధాలు అవుతాయి. దైవ కార్యం పట్టుబట్టలతో చేస్తాం. కాని పితృకార్యం తడిపి ఆరవేసిన వస్త్రాలతోనే చేస్తాం. అవి కూడా నిన్న ఆరేసినవి తగవు. ఆరోజుకారోజు ఆరవేయాలి. బ్రహ్మసృష్టిలోని పదార్థాలు తప్ప విశ్వామిత్రసృష్టివి పితృకార్యాలకు తగవు. పితృకార్యానికి పనికి వచ్చేవి, పనికి రానివి కూడా ఈ గ్రంథంలో శర్మగారు ఇచ్చారు. ఇలా దైవకార్యంకంటే విశిష్టమయినది పితృకార్యం.

నిజానికి సంవత్సరంలో మనం నిర్వహించవలసిన శ్రాద్ధాలు 96 ఉన్నాయి. వాటినే 'షణ్ణవతి శ్రాద్ధాలు' అంటారు. అందులో ఒక్కగానొక్కటి తల్లిదండ్రుల తద్దినం కూడా పెట్టటానికి సిద్ధంకాక మానేస్తున్నారంటే ఎంత ఘోరం? ఆ 96 శ్రాద్ధాలలోనివే ఈ గ్రంథంలో తెల్పిన మహాలయములు కూడా. మనం తినేది వారిచ్చిన తిండే అయినా ఏడాదికి ఒక పక్షం రోజులు మన సమీపానికి వస్తే వారికి తిండి పెట్టడానికి సిద్ధం కాలేము. కనీసం నువ్వులు, నీళ్లైనా వదలలేము. కారణం వాటి విలువ తెలియకపోవడం కూడా. కాబట్టి, ఆలోపం తీర్చడం ధర్మమని భావించి శ్రీకాంత్ శర్మ గారు ఈ మంచి ప్రయత్నం చేశారు. గ్రంథ విస్తర భీతిచే చెప్పడం లేదు తప్ప ఇందుకూడా చాలా విశేషాలున్నాయి. ఎప్పుడు చేయాలి? అంటే

"ఆమ శ్రాద్ధంతు పూర్వాహ్ణే - ఏకోద్దిష్టంతు మధ్యమే

పార్వణం చ అపరాహ్ణే తు ప్రాతర్వృద్ధి నిమిత్తికం"

అని చెప్పబడినందున ఆమశ్రాద్ధం పూర్వాహ్ణము, షోడశ శ్రాద్ధాలు, శస్త్రహత చతుర్దశీ శ్రాద్ధం వంటి ఏకోద్దిష్ట శ్రాద్ధాలు మధ్యాహ్నేన, దర్శ, మహాలయాది పార్వణ శ్రాద్ధాలు అపరాహ్ణంలోను చేయాలి. కానీ అపరాహ్ణ వ్యాప్తి తిథినే మహాలయానికి స్వీకరించాలి.

ఈ గ్రంథంలో శ్రీ శర్మగారు నిత్య తర్పణాలు కూడా ఎవరికి ఎలా ఈయాలనే క్రమం ఇచ్చారు. మహాలయ పక్షాలు సూర్యుడు కన్యలో ప్రవేశించినప్పడు వస్తాయి... అందుకే సంకల్పంలో 'కన్యాగతే సవితరి' అని చెప్తాము. అలా కన్యలోకి రాకుండా వచ్చే మహాలయ పక్షము వస్తే కన్యలోకి వచ్చేదాకా 'కన్యాయనే సవితరి' అని సంకల్పంలో చెప్పాలి.

ఈ సందర్భంలో ఒక ముఖ్య విషయం మీ ముందుంచదలచాను. మన మహర్షులు గొప్ప కారుణ్యమూర్తులు. అందరికీ సద్గతులందాలనే వారి ఆకాంక్ష, దుర్గతిపాలయిన వారికి అందరూ సహకరించాలని వారి ఉద్బోధ. "యేకేచాస్మత్ కులేజాతా" అంటూ సూత్ర నిష్పీడనోదకం వదిలేది అట్టిదే. అంతకంటే కారుణ్యం చూడండి. ఆదిత్య స్థానమెంత సర్వోచ్చస్థానమో రౌరవాది నరకస్థానం అంత నీచస్థానం. అధోలోకాలన్నిటి క్రింద అనంత జీవులు, ప్రేతగణాలు, యాతనా దేహం, త్రిఖండ సోపానం, రౌరవాది నరక స్థానం. అట్టివారికి కూడా రోజూ కాసిని నీళ్ళు వదలమన్నారు. మంచినీళ్ళక్కరలేదు. ఎంగిలి నీళ్ళు వదలండి చాలు అన్నారు. ఆ పనిని జీవత్పితరులు అంటే తండ్రి బ్రతికి ఉన్నవారికి కూడా కర్తవ్యం చేశారు. అదే మన భోజనానంతరం

ఉత్తరాపోశనలో చేతిలో నీరు పోసుకొని కొన్ని నీళ్ళు త్రాగి

"రౌరవే అపుణ్య నిలయే - పద్మార్బుద నివాసినాం

అర్థినా ముదకం దత్తం - అక్షయ్య ముపతిష్ఠతు ॥

అని మిగిలిన నీరు వదిలేది. దానినయినా కాస్త పద్ధతిగా చేయమని మనవి చేస్తున్నాను. చేతిలోని నీరు సగం త్రాగి మిగిలిన సగం విస్తరికి అపసవ్యంగా త్రిప్పుతూ శేషజలం విస్తరికి ఎడమవైపున చూపుడు వ్రేలు మీదుగా వదలాలి. అది కూడా చాలా మంది చేయడం లేదు. ఎటో తిప్పుతూ ఎక్కడో పోస్తున్నారు. పెద్దలు చెప్పాలి.

ధర్మము తానాచరిస్తూ ఇలా అందరిచేత ఆచరింపజేస్తున్న శ్రీకాంత్ శర్మ గారు ధన్యులు. ఇట్టి కారయిత్రృత వీరికి అఖండమయిన పితృదేవతానుగ్రహాన్ని చేకూర్చగలదని ఆశిస్తూ, అందుకు వసు రుద్రాదిత్యులను ప్రార్థిస్తున్నాను.

సుజన విధేయుడు

డా॥ అన్నదానం చిదంబర శాస్త్రి

శార్వరి ఆశ్వయుజం





# అభిప్రాయం

"దేవ పిత్ఋకార్యాభ్యాం నప్రమదితవ్యం" అని వేద శాసనం. దేవ కార్యాల నుండి పిత్ఋకార్యాల నుండి ప్రమాదమును పొందకండి అని శ్రీ శంకరులు ఈ మాటకు అర్థాన్ని రాస్తూ "దైవ పిత్ర్యే కర్మణి కర్తవ్యే" దేవ పిత్ఋకర్మలను తప్పక అచరించాలి అని దీని అర్థము చెప్పిరి. సామాన్యంగా దైవ సంబంధమయిన కర్మలను (పూజాదులను) ఆచరించి, పిత్ఋ సంబంధమయిన కర్మలకు భయపడతారు లేదా అనుమానపడుతుంటారు. మన శాస్త్రాలు ఏమి చెప్పినాయంటే దైవ కార్యాల వల్ల ఏ ప్రయోజనాన్ని పొందుతున్నావో అదే ప్రయోజనాన్ని పిత్ఋకార్యాల వల్ల కూడా పొందుతావు. ఇంకా విచిత్రమేమింటే దైవకార్యాల్లో (పూజల్లో) ఖర్చు అయ్యే అవకాశం ఎక్కువగా ఉంటుంది కాని పిత్ఋసంబంధమయిన ఈ కార్యములలో ఖర్చు ఏమీ ఉండదు. పిత్ఋదేవతల కరుణ మనపై సదా ఉండాలి. వారి కారుణ్య చూపు మనపై ఉంటే ఏదైనా సాధించగలము. ఇట్టి పితరులకు సంబంధించి ఒక లఘు పుస్తకాన్ని అందరికీ అందుబాటులో ఉండేట్టు అనుకూలమయిన సులభ వివరణతో కూడుకొని చాలా చక్కగా సేకరించినారు శర్మగారు. అంతేకాకుండా, మహాలయము గురించి ప్రజలలోని ఎన్నో రకాల అపోహలను సూక్ష్మంలో పోగొట్టి సమాధానాలు చెప్పతూ, 'యజ్ఞోపవీత ధారణ విధి' కూడా ఇందులో పొందుపరచడం అదే సూక్ష్మంగా అందరికీ అనుకూలమయిన రీతిలో ప్రచురించడం జరిగినది. ఇలా సూక్ష్మ గ్రంథమైనప్పటికినీ అనేక విషయాలు క్రోడీకరించి ఉండడం వల్ల "బహురల్పీయసి దృశ్యతే గుణః" అనే నానుడి జ్ఞాపకం రాక మానదు. శ్రీ శర్మ గారు ఇంకా ఇలాంటి ద్విజోపకరములయిన అనేక గ్రంథాలను వెలువరించాలని, అట్టి అనుగ్రహాన్ని మా గౌరీశుడు వారికివ్వాలని ప్రార్థిస్తూ, ఆశీర్వదిస్తూ

పురాణం మహేశ్వర శర్మ
కరీంనగర్



కీ.శే. శ్రీ. నలజాల సత్యనారాయణ గారి

జ్ఞాపకార్థం

వారి కుటుంబ సభ్యులు

నెళ్ళిపాక గ్రామం,

తూర్పుగోదావరిజిల్లా. ఆం.ప్ర.





మా

మాతా పితలు

**కీ.శే. H.S లక్ష్మీ దేవి, లక్ష్మీ నారాయణ గార్ల**

**జ్ఞాపకార్థం,**

కుటుంబ సభ్యులు

**శ్రీ HRLV శివకుమార్ - శ్రీమతి ఇందిరాదేవి**

**శ్రీ HNLV సాయి ప్రసాద్ - శ్రీమతి సురేఖ**

**శ్రీ OLN ఇందు శేఖర్- శ్రీమతి జ్యోతిర్మయి**





**కీ.శే. నాళ్ళ సిద్ధయ్య, సావిత్రి గార్ల**

**జ్ఞాపకార్థం**

వారి కుటుంబ సభ్యులు.

స్వగ్రామం మద్దూర్, సిద్దిపేట.

(ఖైర్‌తాబాద్, హైదరాబాద్ నివాసులు)

# గ్రంథకర్త అభిప్రాయం



ఆస్తిక సుజన బాంధవులకు నమస్సులు.

శ్లో॥ పిత్రూణాంచ ప్రసాదేన కర్తృత్వం శోభివర్ధతే।
శ్రేయాంసాచభివృద్ధిస్స్యాత్ భూయసాం ఉత్తరోత్తరం॥

పితృ దేవతల యొక్క అనుగ్రహం చేత పుత్రాదుల వంశం అభివృద్ధిని పొందుటయే గాక గొప్పవగు శ్రేయస్సులు కూడా విశేషించి కలుగునని ఋషి వాక్యము.

దీని బట్టి పితృ దేవతారాధన ఎంత ప్రధానమో గోచరమగు చున్నది.

మానవ జన్మ పొందిన ప్రతి జీవికి ఋణత్రయ బంధం ముడిపడి వుంటుంది. భగవంతుడు మనకు ప్రసాదించిన బుద్ధి జ్ఞానాల ద్వారా మనం ఋణ త్రయ విముక్తి పొందటానికి చేయవలసిన కర్మను పూర్వులు నిర్దేశించారు.

అందులోదే ఈ పితృఋణం: మన శరీరాల జన్మకు కారణమైన పితృ దేవతల అనుగ్రహాన్ని కూడా మానవులు పొందాలి. సత్సంతాన రూపంలో కొన్ని దేహాలు సృష్టించబడి, సృష్టి కార్యవృద్ధి పొంది, పిండోదక దానాలు జరిగితే పితృ దేవతలు తృప్తిపొంది, సంతానాన్ని ఆశీర్వదిస్తారు. అప్పుడు పితృ ఋణ విముక్తి కలుగుతుంది.

పితరులు గతించిన అనంతరం వసు, రుద్ర, ఆదిత్య స్వరూపులుగా వారు ప్రకృతిలో లయించి ఉంటారు. కాబట్టి ఆయా రూపాలలో వున్న పితృ దేవతలకు శ్రాద్ధ కర్మలు, దర్శశ్రాద్ధ తిల తర్పణ రూపంలో తృప్తిపరిస్తే వారివారి కుటుంబాలకు పితృదేవతల ఆశీస్సులు లభించి, వారి కుటుంబాలు సుఖ శాంతులతో వర్ధిల్లుతాయి. కావున, ప్రతి ఒక్కరూ పితృ ఋణ

విముక్తులు ఎలా కావాలో చెపుతూ, పెద్దలు నిర్దేశించిన కర్మకాండలను విధిగా మనం ఆచరించాలి. ప్రతి నెలా చేయాల్సిన తిల తర్పణం, సంవత్సర శ్రాద్ధ కర్మలు విధిగా చేయాలని పెద్దలు నిర్దేశించారు.

"అమావస్యే దినే ప్రాప్తే, గృహద్వార యే సమాశ్రితః
వాయుభూతాః ప్రవాంఛతి, శ్రాద్ధాం పితృగణాన్నృణామ్-
అని గరుడ పురాణం పేర్కొంటోంది.

అమావాస్య దినం రాగానే పితృ దేవతలు వాయు రూపంలో తమ వారి ఇళ్లకు వచ్చి, సూర్యాస్తమయం వరకూ ఉండి, తమ వారు శ్రాద్ధ కర్మలు నిర్వహించి, అన్నదానాలు చేస్తే సంతృప్తి పొంది, ఆశీర్వదించి వెళ్తారట! బిడ్డకు జన్మనిచ్చిన తల్లితండ్రులు... కోటి ఆశలతో పెంచి, పెద్ద చేసి, విద్యా బుద్ధుల ద్వారా ఒక స్థాయికి తెచ్చినవారు... తమ చరమ దశలో ఆదుకుంటాడని ఆశించడం అసహజం కాదు. అలాకాక, మరోలా ప్రవర్తిస్తే ఏమనాలి? ఊపిరి ఆగిన తరువాత తమకు జన్మనిచ్చిన వారి అంత్యేష్టిని భక్తి శ్రద్ధలతో నిర్వహించి, కర్మకాండ జరిపించడం పితృఋణం తీర్చినట్టు కాదు. వారిని నిత్యం స్మరించాలి. అందుకే శాస్త్రంలో మనకు నిత్య పితృ తర్పణం కనిపిస్తుంది. నిత్యం ఆచరించడానికి కుదరని వారు మాత్రమే అమావాస్య రోజున తర్పణం వదలమన్నారు.

సాధారణంగా ప్రతి అమావాస్యనాడు లేదా పితరులు మరణించిన రోజున శ్రాద్ధ కర్మలను మన పితృ దేవతలకు మాత్రమే పరిమితం చేస్తాం. కానీ, పితృ పక్షాలలోనూ, మహాలయ అమావాస్యనాడు సామూహిక శ్రాద్ధాలు... అంటే మన వంశంలోని పితృ దేవతలకూ, చనిపోయిన బంధు మిత్రులకూ, ఎంతమందికి వీలయితే అంతమందికి పిండ తర్పణాది కార్యక్రమం నిర్వహించవచ్చు.

ఈ గ్రంథంలో ఇచ్చిన విధానం ద్వారా దీనిని నిత్య పితృ తర్పణం వదిలేవారు, అమావాస్య రోజున పితృ తర్పణం వదిలేవారు, మహాలయంలో తర్పణాలు వదిలేవారు, సంక్రమణ కాలంలో

కూడా ఈ గ్రంధములో చెప్పిన విధానంగా అనుసరించి ఆచరించవచ్చును.

అదేవిధంగా వైదిక అవగాహనలేని యజ్ఞోపవీతధారులకు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య ఇతరాదుల్లోని అధికారులందరు సూక్ష్మ విధానంగా, దోష రహితంగా, తమకు తాము స్వయంగా ఎలాంటి సందేహాలు రాకుండా యజ్ఞోపవీత ధారణ చేసుకునే విధానంగా "యజ్ఞోపవీత ధారణ విధి" కూడా ఇందులో అందించడమైనది.

సర్వులకూ ఈ గ్రంధము ఉపయోగమై ఇష్టదేవతానుగ్రహం లభించవలయునని ఆశిస్తున్నాను.

భవదీయుడు

**మద్దికుంట శ్రీకాంత్ శర్మ**





# కృతజ్ఞతా సమర్పణం



కర్తా కారయితా చైవ ప్రేరకశ్చానుమోదకః
సుకృతం దుష్కృతం చైవ చత్వారస్సమ భాగినః !!

ఏ పనికైనా ఒక నలుగురు లేనిదే అది ప్రారంభం కావడం పూర్తి కావడం జరుగదు. అలాంటి కార్యం వలన వచ్చే శుభాశుభ ఫలాలు ఆ నలుగురుకీ సమానంగా లభిస్తాయి. ఈ గ్రంథం విషయంలో కూడా అలాగే జరిగింది.

పితృతర్పణములు ఎలా ఆచరించాలో తెలియజేసేందుకు 33 ని॥ల నిడివిగల ఒక వీడియోను చేసి మా యూట్యూబ్ ఛానల్ పెట్టడం జరిగింది. మహాలయ అమావాస్య సమయానికి ఆ వీడియో వీక్షకుల సంఖ్య అనూహ్యంగా లక్షల్లోకెల్లింది. ప్రతి అమావాస్య సమయంలో ఎస్.సి.లు ఎస్.టి.లు మంగళి, చాకలి ఇలా ఈ సామాజిక వర్గాల వారి నుండి ఫోన్‌లు రావడం, మీ వీడియో చూసి మేము తర్పణం వదిలాము, మనసుకు ఎంతో హాయినిచ్చింది అని వాళ్ళు చెప్పడం నిజంగా నాకెంతో తృప్తినిచ్చింది. అన్ని వర్గాల వారు తర్పణాలు ఆచరించడంలో ఆసక్తిగా ఉన్నారు కనుక వారందరికీ చాలా సులువుగా అర్థమవ్వాలనే ఆలోచనతో ఈ గ్రంథం కార్యరూపం దాల్చింది. ఈ గ్రంథానికి ప్రేరేపకులు పైన చెప్పిన సోదరులే. అందుకే వారందరికీ ముకుళిత హస్తాలతో అంజలి ఘటించి, శిరసు వంచి నమస్కారములు సమర్పించుకుంటున్నాను.

అలాగే అడగగానే ముందుకు వచ్చి గ్రంథ ముద్రణకు ఆర్థికంగా సహకరించిన శ్రీ నలజాల రాంప్రసాద్ గారు, శ్రీ ఇందుశేఖర్ గారు, కీ॥శే॥ నాళ్ల సిద్ధయ్య గారి కుమారులు, కీ॥శే॥ యెర్రమిల్లి సూర్యనారాయణ మూర్తి, కీ॥శే॥ సూర్యకాంతం గార్ల కుటుంబ

సభ్యులకు, దుబాయ్ వాస్తవ్యులు, బ్ర.శ్రీ. నడిమింటి స్వామి గౌతం, శ్రీమతి. అర్చన దంపతులకు ధన్యవాదాలు తెలియ జేసుకుంటూ ఈశ్వరుడు వీరికి సమస్త శుభాలు ప్రసాదించాలని, తమ పితృదేవతలకు శాశ్వత పరబ్రహ్మలోక నివాసం లభించాలని కోరుకుంటున్నాను.

అడిగిన వెంటనే గ్రంథ పరిశీలన చేసి అనుగ్రహించి ఆశీస్సులు అందించిన జగద్గురువులు హంపి పీఠాధీశ్వరులు శ్రీశ్రీశ్రీ విరూపాక్ష విద్యారణ్య భారతి మహాస్వామి వారి పాద పద్మాలకు సాష్టాంగ నమస్కారాలు సమర్పిస్తున్నాను.

అవ్యాజమైన వాత్సల్యంతో ముందు మాట రాసిచ్చిన హనుమత్ ఉపాసకులు బ్రహ్మ శ్రీ అన్నదానం చిదంబర శాస్త్రి గారికి,

వేద విద్వత్ మూర్తులు ఇంటిపేరునే వృత్తిగా మార్చుకున్న బ్రహ్మ శ్రీ పురాణం మహేశ్వర శర్మగారికి,

అపర ధర్మనిష్ఠులు, సనాతన ధర్మ వారధి, వృత్తిపేరునే ఇంటిపేరుగా మార్చుకున్న బ్రహ్మ శ్రీ దర్శనం శర్మ గారికి కృతజ్ఞులు సమర్పించుకుంటున్నాను.

భవదీయుడు

**మద్దికుంట శ్రీకాంత్ శర్మ**



# విషయ సూచిక

## తప్పకుండా తెలుసుకోండి !

- తండ్రి జీవించి ఉన్నవారు తర్పణాలు వదలరాదు.
- తర్పణం అపరాహ్ణ కాలంలో వదలాలి. ఉద్యోగస్తులు మరియు ఇతర కారణాల వలన మధ్యాహ్నం తర్పణం వదలలేనివారు ఉదయం దేవతార్చన ముగించాక ఆచరించవచ్చు.
- తర్పణం మరియు ఆబ్దికాల సమయంలో మెడలో జపమాలలు, చేతికి ఉంగరాలు ధరించి ఉండకూడదు.
- తర్పణం దక్షిణ ముఖంగా ఆచరించాలి.
- నిత్య తర్పణం, అమావాస్య తర్పణములు వదిలేవారు ప్రాతఃకాల నిత్య నైమిత్తికములైన సంధ్యావందనము, దేవతార్చన ముగించాకే వదలాలి. సంక్రమణం రోజున అయితే పుణ్యకాల స్నానం ఆచరించాక వదలాలి.
- అమావాస్య రోజు తర్పణం వదులువారు రాత్రి భోజనం చేయరాదు.
- శ్రాద్ధం పెట్టే రోజున కూడా దేవతార్చన విధిగా చేయాలి. అయితే పూజా సమయంలో ఘంటానాదం చేయడం వాకిట్లో ముగ్గువేయడం చేయరాదు. ఇంట్లో ఆబ్దిక సమయంలో పాత్రల చప్పుడు, కేకలు వేయడం చేయరాదు.
- ఆబ్దికం అనంతరం తిల తర్పణం మరుసటిరోజున సూర్యోదయ సమయానికి ముందే స్నానం చేసి సంధ్యావందన పూర్వం తర్పణం వదలి మళ్ళీ స్నానం చేసి నిత్య విధిని చేసుకోవాలి. కానీ ఆబ్దికం రోజునే తిల తర్పణం వదలకూడదు.
- బ్రాహ్మణులు వసు-రుద్ర-ఆదిత్య రూపములను, ఇతరులందరూ ప్రద్యుమ్న, సంకర్షణ, వాసుదేవ రూపములను చెప్పాలి.

- తమ పెద్దల పేరు చివర బ్రాహ్మణులు శర్మాణం అని, క్షత్రియులు వర్మాణం అని, వైశ్యులు గుప్తానం అని ఇతరులందరూ దాసానం అని చెప్పాలి.
- ఎవరికైనా తమ జ్ఞాతుల గోత్రం తెలియకపోతే కాశ్యపస గోత్రం అని, పేరు తెలియకపోతే యజ్ఞయ్య / యజ్ఞమ్మ అని చెప్పకోవాలి.
- తర్పణ విధిలోని 1 నుండి 43 వరకు వరుసలో గతించిన మీ పితృవర్గం వారెవరో నిర్ధారించుకుని ఆ సంఖ్య వద్ద ✓ మార్కు చేసుకోండి.
- ఎలాంటి సందేహం వచ్చినా ఫోన్ చేసి నివృత్తి చేసుకోండి.



## తర్పణమునకు కావలసిన సామాగ్రి

- పవిత్ర
- దర్భలు
- నల్ల నువ్వులు
- రాగి / ఇత్తడి చెంబులో నీళ్ళు
- ఆచమన పాత్ర, ఉద్ధరిణ, పళ్ళెము
- తర్పణం వదలడానికి ఇత్తడి / రాగి పళ్ళెం
- కూర్చోడానికి ఆసనం
- దర్భలు లభ్యం కాకపోతే గరికను ఉపయోగించవచ్చు.
- చేతి రుమాలు

## సవ్య అపసవ్యములు అంటే ?

- సవ్యం:- యజ్ఞోపవీతము ఎడమ భుజంపై ఉండి నడుము కుడివైపునకు ఉండడం.
- అపసవ్యం(పాచీనావీతి):- యజ్ఞోపవీతము కుడి భుజంపై ఉండి నడుము ఎడమవైపునకు ఉండడం.

- నివీతి:- యజ్ఞోపవీతము పూలదండ వేసుకున్నట్లుగా ఉండడం.



# పితృవర్గ వరుస క్రమము

శ్లో॥ ఆదౌ పితా తథా మాతా సాపత్నీమాతరస్తథా।
మాతామహస్సపత్నీకాః ఆత్మపత్న్య స్త్వనంతరం॥
సుత భ్రాతృ పితృవ్యశ్చ మాతులస్సహభార్యకాః।
దుహితా భగినీ చైవ దౌహిత్రో భాగినేయకః॥
పితృష్వసా మాతృష్వసా జామాతా భావుకస్స్నుషా।
శ్వశురస్స్యాలకశ్చైవ స్వామినో గురు రిక్థినః॥

1. పితృవర్గము :- తండ్రి, తాత, ముత్తాత
2. మాతృవర్గము :- తల్లి, నానమ్మ, తాతమ్మ, (తాతగారి తల్లి)
3. సాపత్నిమాతరం :- సవతి తల్లి
4. మాతామహవర్గం:- అనగా తల్లి యొక్క తండ్రి, తల్లి యొక్క తాత, తల్లి యొక్క ముత్తాత
5. మాతామహ్యాది వర్గం :- అమ్మమ్మ (తల్లి యొక్క తల్లి), తల్లిగారి నానమ్మ, తల్లి గారి తాతమ్మ
6. ఆత్మ పత్ని :- తన భార్య
7. సుత :- తన కుమారుడు
8. భ్రాతృ :- తన సొంత సోదరులు
9. పితృవ్యం :- చిన్నాన్న, పెదనాన్నలు
10. మాతులం :- మేనమామ
11. దుహిత :- కూతురు
12. భగినీ :- తన సోదరి
13. దౌహిత్రం :- కూతురి కొడుకు
14. భాగినేయం :- మేనల్లుడు
15. పితృష్వషా :- మేనత్త

16. మాతృషసా :- తల్లి తోబుట్టువులు, పెద్దమ్మ, చిన్నమ్మలు
17. జామాత :- తన కూతురి భర్త (అల్లుడు)
18. భావుక :- తన తోబుట్టువు భర్త (బావ)
19. స్నుషా :- తన కోడలు (కొడుకు భార్య)
20. శ్వశురం :- తన భార్య యొక్క తండ్రి (మామ)
21. శ్యాలక :- తన భార్య సోదరుడు (బావమరుదులు)
22. స్వామినం :- ఆచార్యుడు (ఇంటి పురోహితుడు)
23. గురుం :- ఉపదేశం చేసిన గురువు, బ్రహ్మోపదేశం చేసిన తండ్రి
24. రిక్థినం :- ఆప్తులు



# పితృతర్పణ విధి

దీపారాధన చేసి సంధ్యావందనం నిత్యపూజ, ముగించుకొని ఆచమనం చేయాలి.

ఆచమ్య! (కుడి అరచేయిని గోకర్ణ ఆకృతిలో పెట్టి మినపగింజ అంత నీరు పోసుకొని కింది నామాన్ని చెప్పి శబ్దం రాకుండా తాగాలి.)

1. ఓం కేశవాయ స్వాహా!
2. ఓం నారాయణాయ స్వాహా!
3. ఓం మాధవాయ స్వాహా!
4. ఓం గోవిందాయ నమః,
5. ఓం విష్ణవే నమః,
6. ఓం మధుసూదనాయ నమః,
7. ఓం త్రివిక్రమాయ నమః,
8. ఓం వామనాయ నమః,
9. ఓం శ్రీధరాయ నమః,
10. ఓం హృషీ కేశాయ నమః,
11. ఓం పద్మనాభాయ నమః,
12. ఓం దామోదరాయ నమః,
13. ఓం సంకర్షణాయ నమః,
14. ఓం వాసుదేవాయ నమః,
15. ఓం ప్రద్యుమ్నాయ నమః,
16. ఓం అనిరుద్ధాయ నమః,
17. ఓం పురుషోత్తమాయ నమః,
18. ఓం అధోక్షజాయ నమః,
19. ఓం నారసింహాయ నమః,
20. ఓం అచ్యుతాయ నమః,
21. ఓం జనార్దనాయ నమః,
22. ఓం ఉపేంద్రాయ నమః,
23. ఓం హరయే నమః,
24. ఓం శ్రీ కృష్ణాయ నమః

పృథివ్యాః మేరూ పృష్ఠ ఋషిః, కూర్మో దేవతా, సుతలం ఛందః, ఆసనే వినియోగః, అనంతాసనాయ నమః, ప్రణవస్య పరబ్రహ్మా ఋషిః పరమాత్మా దేవతా దైవీ గాయత్రీ ఛందః, ప్రాణాయామే వినియోగః!

## ప్రాణాయామ విధానం

(ప్రాణాయామం అనగా కుడిచేయి బొటనవేలుతో ముక్కు కుడి రంధ్రం మూసుకుని ఎడమ రంధ్రం నుండి గాలిని పొట్ట నిండేంత వరకు మెల్లిగా పీల్చుకుని, ఉంగరంవేలు మధ్యవేలితో ఎడమ రంధ్రం మూసివేయాలి. గాలి వదలకుండా గాయత్రి మంత్రం మనసులో చెప్పుకొని పీల్చుకున్న గాలిని కుడి రంధ్రం నుండి మెల్లగా వదిలేయాలి. దీనినే 'ప్రాణాయామం' అంటారు. శ్వాసను పీల్చుకోడాన్ని పూరకము, బంధించడాన్ని కుంభకము, వదలడాన్ని రేఫకము అంటారు.)

ఓం భూః ఓం భువః ఓం సువః ..... యాత్ !
(మంత్రం రానివారు కింది శ్లోకం చదువుకోవాలి)

అంగుల్యాగ్రై నాసికాగ్రం సంపీడ్య పాపనాశనం !
ప్రాణాయామం ఇదం ప్రోక్తం ఋషిభిః పరికల్పితం !!

శ్రీ గోవింద, గోవింద, గోవింద....!
శ్రీ మహావిష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్య బ్రహ్మణః ద్వితీయ పరార్థే, శ్వేతవరాహ కల్పే, వైవస్వత మన్వంతరే, కలియుగే ప్రథమ పాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, మేరోః దక్షిణ దిగ్భాగే శ్రీశైలస్య ..... ( దిక్కు పేరు. ఉదా: వాయువ్య ) ప్రదేశే, కృష్ణా గోదావర్యోః ( ఏ నదుల వద్ద ఉంటే ఆ నది పేరు చెప్పాలి ). మధ్యప్రదేశే, శాలివాహన శకే, బౌద్ధావతారే,
( అమెరికాలో నివసించేవారైతే.. క్రౌంచ ద్వీపే, రమణక వర్షే, ఐంద్ర ఖండే, సప్త సముద్రాంతరే, కపిలారణ్యే అని చెప్పుకోవాలి ).

స్వగృహే / వసతి గృహే, సమస్త దేవతా బ్రాహ్మణ హరి హర గురు చరణ సన్నిధౌ, అస్మిన్ వర్తమాన, వ్యావహారిక చాంద్రమానేన స్వస్తి శ్రీ --- నామ సంవత్సరే .... అయనే (ఉత్తరాయణం / దక్షిణాయణం). ...... ఋతౌ, ...... మాసే, ..... పక్షే (శుక్ల / కృష్ణ), ....

తిథౌ, .... వాసరే, శుభ నక్షత్రే, శుభ యోగే, శుభకరణ, ఏవంగుణ విశేషణ విశిష్టాయాం పుణ్యతిథౌ.

**(మహాలయంలో అయితే కేవలం వర్ష ఋతౌ, భాద్రపద మాసే, కృష్ణ పక్షే, -- తిథౌ, ---- వాసరే. ఆ రోజు తిథి, వారం ఏదైతే అది చెప్పుకోవాలి).**

**(తిథులు, వారాల సంస్కృత పదాలు పేజి నం. 48 లో చూడగలరు.)**

**ప్రాచీనావీతి**

అస్మత్ పిత్ళవ్యాది సర్వేషాం పిత్రూనాం పునరావృత్తి రహిత శాశ్వత పరబ్రహ్మలోక నిత్యనివాస సిద్ధ్యర్థం, అక్షయ్య పుణ్యలోక అవాప్తి అర్థం నిత్య పిత్ళతర్పణం జల రూపేణ అద్య కరిష్యే...

మహాలయంలో అయితే... అస్మత్ పిత్రు మాతులాది వర్గద్వయ అవశిష్టానాం సర్వేషాం కారుణీక పిత్రూనాం అక్ష్యయ్య తృప్తి అర్థం కన్యాగతే సవితరి ఆషాఢ్యాది పంచమ అపర పక్ష ప్రయుక్త మహాలయ పక్ష పుణ్యకాలే తిలతర్పణ రూపేణ అద్య కరిష్యే !

**సంక్రాంతి కాల సంకల్పం:**

అస్మత్ పిత్రూన్ ఉద్దిశ్య పిత్ళ ప్రీత్యర్థం సర్వేషాం పిత్రూనాం అక్షయ పుణ్యలోక అవాప్తి అర్థం - సంక్రాంతి కాల పిత్ళ తర్పణం అహం కరిష్యే!

సవ్యం !

పవిత్రం ధృత్వా ।
మం॥ పవిత్రవంతః - శ్వారభం॥

**(పవిత్ర అనగా దర్భతో తయారు చేసిన ముడి. అలా అవకాశం లేకపోతే రెండు దర్భలను ఉంగరం వేలు చూపుడు వేలు మధ్యలో పెట్టుకోవాలి. మధ్యవేలి కింది నుండి ఈ దర్భలు రావాలి.)**

పునః ఆచమ్య ! ఓం కేశవాయ స్వాహా ... శ్రీ కృష్ణాయ నమః !

**ప్రాచీనావీతి !**




**దక్షిణం వైపు తిరిగి కూర్చోవాలి.**

1. అస్మత్ పితరం (తండ్రి) ---- గోత్రం ---- శర్మాణం (వర్మాణం / గుప్తానం / దాసానం) వసురూపం / ప్రద్యుమ్న రూపం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి (అని నువ్వులు నీళ్ళ దర్భల నుండి 3 సార్లు పళ్లెంలో / ధర్భలపై వదిలేయాలి.)

2. అస్మత్ పితామహం (తాత / తండ్రి గారి తండ్రి) ---- గోత్రం ---- శర్మాణం (వర్మాణం / గుప్తానం / దాసానం) రుద్ర రూపం / సంకర్షణ రూపం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి. ( అని నువ్వులు నీళ్ళ, దర్భల నుండి ప్రతిసారి 3 సార్లు వదిలేయాలి. )

3. అస్మత్ ప్రపితామహం (తండ్రి గారి తాత) ---- గోత్రం ---- శర్మాణం (వర్మాణం / గుప్తానం / దాసానం)

   ఆదిత్య రూపం / వాసుదేవ రూపం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

4. అస్మత్ మాతరం (తల్లి) ---- గోత్రాం ---- దాయీం వసురూపాం / ప్రద్యుమ్న రూపాం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

5. అస్మత్ పితామహీం (తల్లి గారి అత్తగారు అనగా నానమ్మ) ---- గోత్రాం ---- దాయీం రుద్రరూపాం / సంకర్షణ రూపాం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

6. అస్మత్ ప్రపితామహీం (నానమ్మ గారి అత్తగారు) ---- గోత్రాం ---- దాయీాం ఆదిత్య రూపాం / వాసుదేవ రూపాం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

7. అస్మత్ సాపత్ని మాతరం (సవతి తల్లి) ---- గోత్రాం ---- దాయీాం వసురూపాం / ప్రద్యుమ్న రూపాం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

8. అస్మత్ మాతామహం (తాత అనగా తల్లి గారి తండ్రి) --- గోత్రం --- శర్మాణం (వర్మాణం / గుప్తానం / దాసానం)

వసురూపం / ప్రద్యుమ్న రూపం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

9. అస్మత్ మాతుః పితామహం (తల్లి గారి తాత గారు) ---- గోత్రం ---- శర్మాణం (వర్మాణం / గుప్తానం / దాసానం)

రుద్రరూపం / సంకర్షణ రూపం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

10. అస్మత్ మాతుః ప్రపితామహం (తల్లి గారి తాతగారి తండ్రి గారు) ---- గోత్రం ---- శర్మాణం (వర్మాణం / గుప్తానం / దాసానం)

ఆదిత్య రూపం / వాసుదేవ రూపం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

11. అస్మత్ మాతామహీం (అమ్మమ్మ) ---- గోత్రాం ---- దాయీాం వసు రూపాం / ప్రద్యుమ్న రూపాం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

12. అస్మత్ మాతుః పితామహీం (అమ్మగారి నానమ్మ) ---- గోత్రాం ---- దాయీాం రుద్ర రూపాం / సంకర్షణ రూపాం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

13. అస్మత్ మాతుః ప్రపితామహీం (తల్లి యొక్క తాతగారి తల్లి అనగా నానమ్మ గారి అత్త) ---- గోత్రాం ---- దాయీం ఆదిత్య రూపాం / వాసుదేవ రూపాం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

14. అస్మత్ ఆత్మ పత్నీం (తన భార్య) ---- గోత్రాం --- దాయీం వసు రూపాం / ప్రద్యుమ్న రూపాం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

15. అస్మత్ సుతం (తన సొంత కుమారుడు) ---- గోత్రం ---- శర్మాణం (వర్మాణం / గుప్తానం / దాసానం) వసు రూపం / ప్రద్యుమ్న రూపం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

16. అస్మత్ జేష్ఠ / కనిష్ఠ భ్రాతరం (తన సొంత సోదరుడు) ---- గోత్రం ---- శర్మాణం (వర్మాణం / గుప్తానం / దాసానం) వసు రూపం / ప్రద్యుమ్న రూపం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

(తన కన్నా పెద్ద సోదరుడు అయితే జేష్ఠ భ్రాతరం అని, చిన్నవాడు అయితే కనిష్ఠ భ్రాతరం అని అనాలి)

17. తత్ పత్నీం (పై సోదరుని భార్య 16) ---- గోత్రాం ---- దాయీం వసు రూపాం / ప్రద్యుమ్న రూపాం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

18. అస్మత్ పితృవ్యం (చిన్నాన్న / పెదనాన్న) ---- గోత్రం ---- శర్మాణం (వర్మాణం / గుప్తానం / దాసానం) వసురూపం / ప్రద్యుమ్న రూపం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

19. తత్ పత్నీం (పై వారి భార్య 18) ---- గోత్రాం ---- దాయీం వసు రూపాం / ప్రద్యుమ్న రూపాం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

20. తత్ పుత్రం (పై వారి కుమారుడు 18 & 19) ---- గోత్రం ---- శర్మాణం (వర్మాణం / గుప్తానం / దాసానం) వసురూపం / ప్రద్యుమ్న రూపం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

21. తత్ పత్నీం (అతని భార్య 20) ---- గోత్రాం ---- దాయీం వసురూపాం / ప్రద్యుమ్న రూపాం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

22. అస్మత్ మాతులం (మేనమామ) ---- గోత్రం ---- శర్మాణం / (వర్మాణం / గుప్తానం / దాసానం) వసురూపం / ప్రద్యుమ్న రూపం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

23. తత్ పత్నీం (అతని భార్య 22) ---- గోత్రాం ---- దాయీం వసురూపాం / ప్రద్యుమ్న రూపాం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

24. అస్మత్ దుహితరం (తన సొంత కూతురు) ---- గోత్రాం ---- దాయీం వసురూపాం / ప్రద్యుమ్న రూపాం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

25. అస్మత్ ఆత్మ భగినీం (తన సోదరి) ---- గోత్రాం ---- దాయీం వసురూపాం / ప్రద్యుమ్న రూపాం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

26. తత్ భర్తారం (ఆమె భర్త 25) ---- గోత్రం ---- శర్మాణం (వర్మాణం / గుప్తానం / దాసానం) వసురూపం / ప్రద్యుమ్న రూపం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

27. అస్మత్ దౌహిత్రం (తన కూతురి కొడుకు అనగా మనుమడు) ---- గోత్రం ---- శర్మాణం (వర్మాణం / గుప్తానం / దాసానం) వసురూపం / ప్రద్యుమ్న రూపం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

28. తత్ పత్నీం (అతని భార్య 27) ---- గోత్రాం ---- దాయీం వసురూపాం / ప్రద్యుమ్న రూపాం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

29. అస్మత్ భాగినేయకం (తన మేనల్లుడు) ---- గోత్రం ---- శర్మాణం (వర్మాణం / గుప్తానం / దాసానం) వసురూపం / ప్రద్యుమ్న రూపం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

30. తత్ పత్నీం (అతని భార్య 29) ---- గోత్రాం ---- దాయీం వసురూపాం / ప్రద్యుమ్న రూపాం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

31. అస్మత్ పితృ భగినీం (తన మేనత్త) ---- గోత్రాం ---- దాయీం వసురూపాం / ప్రద్యుమ్న రూపాం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

32. తత్ భర్తారం (ఆమె భర్త 31) ---- గోత్రం ---- శర్మాణం (వర్మాణం / గుప్తానం / దాసానం) వసురూపం / ప్రద్యుమ్న రూపం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

33. అస్మత్ మాతృ భగినీం (తన చిన్నమ్మ / పెద్దమ్మ) ---- గోత్రాం ---- దాయీం వసురూపాం / ప్రద్యుమ్న రూపాం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

(చిన్నమ్మ అయితే కనిష్ఠ మాతృ భగినీం అని పెద్దమ్మ అయితే జేష్ఠ మాతృ భగినీం అని చెప్పకోవాలి)

34. తత్ భర్తారం (ఆమె భర్త 33) ---- గోత్రం ---- శర్మాణం (వర్మాణం / గుప్తానం / దాసానం) వసురూపం / ప్రద్యుమ్న రూపం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

35. అస్మత్ జామాతరం (తన అల్లుడు అనగా బిడ్డ భర్త) ---- గోత్రం ---- శర్మాణం (వర్మాణం / గుప్తానం / దాసానం) వసురూపం / ప్రద్యుమ్న రూపం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

36. అస్మత్ స్నుషాం (తన కోడుకు భార్య) ---- గోత్రాం ---- దాయిాం వసురూపాం / ప్రద్యుమ్న రూపాం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

37. అస్మత్ శ్వశురం (తన మామ అనగా భార్య తండ్రి) ---- గోత్రం ---- శర్మాణం (వర్మాణం / గుప్తానం / దాసానం) వసురూపం / ప్రద్యుమ్న రూపం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

38. తత్ పత్నీం (అతని భార్య అనగా భార్య తల్లి 37) ---- గోత్రాం ---- దాయిాం వసురూపాం / ప్రద్యుమ్న రూపాం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి. (కొన్ని సందర్భాల్లో మామగారు జీవించి ఉండి అత్తగారు గతించవచ్చు. అలాంటి సందర్భంలో మామగారిని ఇందులో చెప్పకుండా అస్మత్ శ్వశురోన్ (అత్త) అని మాత్రమే చెప్పాలి)

39. అస్మత్ శ్యాలకం (తన బావమరిది అనగా భార్య తమ్ముడు / అన్న) ---- గోత్రం ---- శర్మాణం (వర్మాణం / గుప్తానం / దాసానం) వసురూపం / ప్రద్యుమ్న రూపం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

40. తత్ పత్నీం (అతని భార్య 39) ---- గోత్రాం ---- దాయీం వసురూపాం / ప్రద్యుమ్న రూపాం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

41. అస్మత్ గురుం (తనకు విద్య నేర్పిన గురువు / ఉపదేశం ఇచ్చిన గురువు / లేదా మార్గదర్శి) ---- గోత్రం ---- శర్మాణం (వర్మాణం / గుప్తానం / దాసానం) వసురూపం / ప్రద్యుమ్న రూపం స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

42. అస్మత్ రిక్థినం (సర్వులూ) ---- గోత్రం ---- శర్మాణం వసురూపం / ప్రద్యుమ్న రూపం, స్వధానమః తర్పయామి తర్పయామి తర్పయామి.

## ! అంజలి జలదానం !

సమస్త పితృ దేవతలందరికీ దోసలితో 3 సార్లు నీరు అర్పించాలి.

1. శ్లో॥ యే బాంధవాః యే అబాంధవాః
యే యే అన్య జన్మని బాంధవాః !
తే సర్వే తృప్తి మాయాంతు
మయా దత్తేన వారిణా ‼

2. శ్లో॥ ఆబ్రహ్మాస్తంబ పర్యంతం దేవర్షి పితృ మానవాః !
తృప్యంతు పితరః సర్వే మాతృ మాతామహాదయః ‼

3. శ్లో॥ అతీత కుల కోటీనాం సప్త ద్వీప నివాసినాం !
ఆబ్రహ్మా భువనాల్లోకాత్ ఇదమస్తు తిలోదకం ‼



## !! సూత్ర / వస్త్ర నిష్పీడన ఉదక దానం !!

( కింది శ్లోకం చెబుతూ మీ జంధ్యము యొక్క బ్రహ్మ ముడులపై నుండి / వస్త్రం ముడి నుండి నీళ్ళు పోసుకుంటూ చెప్పి చివరికి ఆ ముడిని పిండి నమస్కరించుకోవాలి. )

శ్లో!! యేకేచ అస్మత్ కులేజాతా అపుత్రా గోత్రినోమృతాః !

తే గృహ్ణంతు మయా దత్తం సూత్రం / వస్త్రం నిష్పీడనోదకం !!

( కింది శ్లోకం చెబుతూ చేతిలోని దర్భలను ఉత్తరం వైపు వదిలేయాలి. )

శ్లో॥ యేషాం న మాతా న బంధుః పితా న అన్య గోత్రిణః !

తే సర్వే తృప్తి మాయాంతు మయో త్రుప్టియైః కుషైః సదా !!

**సవ్యం. పునః ఆచమ్య :**

(తూర్పువైపు తిరిగి మళ్ళి ఆచమనం చేయాలి...కృష్ణాయనమః వరకు)

మంత్ర మద్యే క్రియా మద్యే విష్ణోః స్మరణ పూర్వకం !

యత్కించిత్ క్రియతే కర్మ తత్కర్మ సఫలం భవేత్ !

విష్ణుర్విష్ణుర్విష్ణుర్విష్ణుర్ విష్ణుః

అచ్యుతాయ నమః అనంతాయ నమః గోవిందాయ నమః

అచ్యుతానంత గోవిందేభ్యో నమో నమః

పవిత్రం విసృజ్య !

(దర్భ ఉంగరం ముడిని విప్పి పళ్ళెంలో వదిలేయాలి)

అనేన పితృ తర్పణేన భగవాన్ సర్వాత్మక : సర్వం శ్రీ పరమేశ్వర అర్పణం అస్తు !!

(అని నీళ్ళు పళ్ళెంలో వదలాలి. తర్పణం వదిలిన నువ్వులు నీళ్ళను మొక్కలకు పోయవచ్చు, కానీ తులసి మొక్కలో పోయకూడదు).



# శ్రాద్ధ ధర్మ విషయాలు

1.శ్లో॥ జీవమానః పితాయస్య మాతాయదివిపద్యతే।
మాతుః శ్రాద్ధం సుతః కుర్యాత్ నకుర్యాత్ తిలతర్పణం ॥

తా॥ తండ్రి జీవించి యుండి తల్లి మరణించినచో కుమారుడు శ్రాద్ధము మాత్రమే పెట్టవలెను కాని, తిల తర్పణము ఆచరించరాదు. తండ్రి జీవించియున్న పుత్రునకు తిల తర్పణము వదులు అధికారం లేదని గ్రహించవలయును.

2.శ్లో॥ గోమయేనోపలేపంచ సర్వ శ్రాద్ధే ప్రకీర్తిదం !
తం గృహాలంకరణం నాస్తి ఇతి శాతాతపోబ్రవేత్ !!

సమస్త శ్రాద్ధ దినములందు ఇంటిముందు గోమయముచే భూమిని అలుకవలెను, కళ్ళాపి చల్లవలెను కానీ, ముగ్గులు పెట్టరాదని శాతాతపుని వాక్యము.

### 3. శ్రాద్ధంలో విష్ణు భోక్త ప్రాధాన్యత

అ) యత్కించిత్ పార్వణం శ్రాద్ధం తత్ర సర్వత్ర చ ద్విజే !
పూజయేత్ విష్ణు మిత్యేవమితి ప్రాహ పితామహః !!

పిండ ప్రదానంగా ఏ శ్రాద్ధం చేసినా, ఒక బ్రాహ్మణుని యందు విష్ణువును ఆవాహనము చేయవలెనని బ్రహ్మదేవుడే చెప్పి యున్నాడు.

ఆ) యత్ శ్రాద్ధం పార్వణం ప్రోక్తం తత్ శ్రాద్ధం వైష్ణవం వినా !
కృతం నశ్యతి కౌంతేయ పతితే నేక్షితం యధా !!

ఏ శ్రాద్ధము పిండ ప్రదానంగా ఆచరింపబడునో అట్టి శ్రాద్ధము విష్ణు భోక్తలేకుండా చేసిన ఎడల వ్యర్థమగునని భారతంలో కృష్ణపరమాత్మ అర్జునుడితో అంటున్నాడు.

ఇ) దర్శే మహాలయే తీర్థే సపిండీకరణే తథా !

వ్యర్థం భవతి తత్ శ్రాద్ధం వాసుదేవం వినా కృతం !!

దర్శ శ్రాద్ధము, మహాలయము, తీర్థ శ్రాద్ధము, సపిండీకరణము ఈ శ్రాద్ధాలలో విష్ణు స్థాన భోక్త లేకుండా ఆచరిస్తే అది నిష్ఫలమగును.

### 4. భోక్త అశౌచ విషయం

భోక్తు స్తృతీయ నిమంత్రణ ప్రభృత్యాశౌచభావః !

తత్ పూర్వం ఆగతం చేత్ ఆశౌచమస్త్యేవ !!

భోక్తకు మూడవ పర్యాయం నిమంత్రణమైన తర్వాత అశౌచం సంభవించినప్పటికీ అతనికి అశౌచ దోషములేదు. అంతకు ముందు అశౌచం వచ్చినచో అశౌచం ఉండును.

### 5. శ్రాద్ధంలో కర్తకు అశౌచ విషయము

కర్తస్తు ప్రారంభానంతరం అశౌచాభావః !

తత్ పూర్వం చేనాశౌచామస్త్యేవ !!

కర్త శ్రాద్ధం ప్రారంభించిన తర్వాత అశౌచం వచ్చినప్పటికీ అతనికి అశౌచం లేదు. ప్రారంభించక పూర్వమే అశౌచం వచ్చిన ఎడల అశౌచం ఉండును.

### 6. సువాసినీ భోజన విధి

సువాసిన్యాం మృతాయాంతు బ్రాహ్మనైస్సహ భోజనే !

సువాసినీం తతః పశ్చాదమంత్రకమధార్చయేత్ !!

ముత్తైదువ మృతి నొందిన యెడల బ్రాహ్మణులతో కూడా ఒక ముత్తైదువకు భోజనము పెట్టవలెను. మంత్ర పూర్వకంగా సువాసినిని పూజించనవసరంలేదు.

### 7. కర్త శ్రాద్ధ శేష భోజన విధి

ప్రదక్షణమనువ్రజ్య భుంజీత పితృసేవితం !
శ్రాద్ధం కృత్వాతుయో విప్రో నభుంజైతు కదాచన !!
దేవాః హవ్యం న గృహ్ణంతి కవ్యంతు పితరస్తధా !!!

బ్రాహ్మణులకు ప్రదక్షణము చేసి, వారిని పంపించి, శ్రాద్ధ శేషాన్నమును కర్త భుజించవలెను. అట్లు భుజింపనివాని పూజలు దేవతలు, శ్రాద్ధాలు పితరులు గ్రహింపరు.

### 8. ఉపవాసం ఉన్న రోజున శ్రాద్ధం వస్తే?

ఉపవాసో యదా నిత్య శ్రాద్ధం నైమిత్తికం భవేత్ !
ఉపవాసం తదా కుర్యాత్ ఆఘ్రాయ పితృ సేవితం !!

కర్త ఉపవాసమున్న రోజున శ్రాద్ధం వస్తే, శ్రాద్ధమును సంపూర్ణంగా ఆచరించి, ఒక మెతుకును వాసన చూసి ఉపవాసమును కొనసాగించవలెను.

### 9. అశౌచంలో ఆబ్దికం వస్తే?

శుచి భూతేన దాతవ్యా యా తిథి ప్రతిపద్యతే !
సా తిథిస్తస్య కర్తవ్య నచాన్యం వై కదాచన !!

మైలలో ఉండగా అనగా, పురుడు లేదా సూతకంలో ఉండగా ఆబ్దికం సంభవించిన ఎడల, కర్త ఏరోజైతే శుద్ధి అవుతాడో అదేరోజున ఆబ్దికమును నిర్వహించవలెను కాని మరొక రోజున పెట్టగూడదు.

### 10. భోక్తకు గాయత్రీ జప విధి

ప్రత్యబ్దే త్రిశతం చైవ మాసికే శత పంచకం !
ద్విసహస్రం సపిండేచ అయుతం ప్రేత భోజనం !!

ప్రత్యాబ్దికమందు 300, మాసికమునందు 500, సపిండీకరణ మునందు 2000, ప్రేత భోజన కాలమునందు 10,000 గాయత్రీ మంత్ర జపమును భోక్త ఆచరించవలెను.

## వివాహ ఉపనయనం ఆచరించిన ఇంట శ్రాద్ధ విశేషం !

### 11. తిలతర్పణ నిషేధ కాలం

మౌంజీ బధ్వా వివాహోచ్చ, షన్మాసం వర్షమేవవా !
నకుర్యాత్ పిండ దానంచ, నదద్యాత్తు తిలోదకం !!

ఉపనయనం లేదా వివాహం అయిన తదుపరి 6 మాసములు లేదా సంవత్సరం వరకు గాని పిండప్రదానం కానీ తిల తర్పణాలు కాని ఆచరించరాదు. ఒకవేళ కర్తకు సోదరులుంటే వారు తప్పక ఆచరించవలెను. ఒకవేళ కర్త ఒకడే అయితే బ్రహ్మార్పణంగా శ్రాద్ధం ఆచరించాలి, కాని పడేయరాదు.

### 12. ఆమ శ్రాద్ధము

శ్రాద్ధ విఘ్నే ద్విజాతీనాం ఆమశ్రాద్ధం ప్రకీర్తితం !
అమావాస్యాది నియతం మాస సాంవత్సరాభ్రుత !!

శ్రాద్ధమునకు విఘ్నము సంభవించినపుడు మాసికము ఆబ్దికము మొ.వి. ఆమద్రవ్యములచేతనే బ్రాహ్మణులు చేయదగినవి. ఆమద్రవ్యమనగా భోజన సామాగ్రి.

### అ) 13. పాద ప్రక్షాళన విధి

మండలాత్ పశ్చిమే భాగే బహిరేవస్థితో ద్విజః !
తత్రైవ విసృజేత్ పాద్యం ప్రక్షాళనం మండలోపరి !!

మండలమునకు పడమటిభాగమున పాదములనుంచి పాద్యమును విడువవలెను. పాద ప్రక్షాళనము మాత్రము పాదములను మండలము మీద నుంచి చేయవలెను.

### ఆ) పాద ప్రక్షాళన ఉదక మార్జనం

దేవపాదోదకం స్నానం స్పర్శనం పితృ మండలే !
ఉభయో స్నానమాప్నోతి పునః కర్తా విధీయతే !!

విశ్వేదేవుల యొక్క పాదోదకమును పైన మార్జనము చేసుకొనుట, పితృ స్థానము యొక్క మండలమును కేవలం స్పృశించుట కర్తకు స్నానంతో సమానము. కాబట్టి పితృ స్థానమందు బ్రాహ్మణుడి పాదోదకమును శిరస్సున ధరింప అవసరములేదు.

### ఇ) భోక్తలకు పాద ప్రక్షాళన ఎందుకు చేయాలి?

పాదమూలే పితృ స్థానం పాద మధ్యే పితామహ !
ప్రపితామహస్తు పాదాగ్రే పాదౌ ప్రక్షాళయేత్ క్రమాత్ !!

నిమంత్రణ చేసిన బ్రాహ్మణుడి పాదం మూలంలో తండ్రి / తల్లి, పాదం మధ్యలో తాత / నానమ్మ, పాదం అగ్రంలో ముత్తాత / ముత్తవ్వ ఉంటారట కనుక వారికి పాద ప్రక్షాళన చేస్తారు.

### ఈ) పాద ప్రక్షాళన విధానం !

విప్ర ప్రక్షాళన కాలేతు దాతా భోక్తా ద్విజోత్తమః !
సుఖాసీనో భవేశ్రాద్దేత్ అన్యధా నరకం వ్రజేత్ !!

భోక్తలకు పాద ప్రక్షాళన చేసే సమయంలో కర్తా భోక్త బ్రాహ్మణుడు ఆసనం పై కూర్చొని పాద ప్రక్షాళన గావించాలి, లేనిచో నరకం పొందుదురు.

(భోక్తని ఒక పీట / చిన్న స్టూల్ పైన కూర్చోబెట్టి ఒక పళ్ళెంలో కాళ్ళను కడగడం ఉత్తమం. విశ్వేదేవ భోక్త కాళ్ళు కడిగిన నీళ్ళు పితృ భోక్త కాళ్ళు కడిగిన నీళ్ళు కలువకూడదు కావున పళ్ళెంలో వేరు వేరుగా కడిగి వేరు వేరుగా ఆ నీళ్ళను పారబోయాలి. ఇరు భోక్తలకి ఒకే పళ్ళెం వాడొచ్చు కానీ కడిగిన నీళ్ళను కలవకుండా చూడాలి.)

### 14. శ్రాద్ధే మధు ( తేనె ) విషయః !!

శ్రాద్ధేహి మధు మంత్రేణ మధు దేయం ప్రయత్నతః !
మధ్వలభే జపేన్మంత్రం సుధాపాన సమం భవేత్ !!
మధ్వలభే యదిగుడం యో దద్యాత్ సర్వకర్మసు !
వ్యర్థం భవతి తత్ శ్రాద్ధం ఇతి శాతాతపోబ్రవీత్ !!

శ్రాద్ధమందు మధువాతా అను మంత్రముచ్చరిస్తూ తేనెను వడ్డనచేయవలెను. నేటికాలంలో తేనె లేకపోతే బెల్లము నుంచుతున్నారు. అలా చేసినయెడల ఆ శ్రాద్ధము నిష్ఫలమగును. తేనె లేని యెడల "మధువాతా ఋతాయతే" అను మంత్రమును చెప్పవలెను. అమృత పానము చేసినఫలము కలుగును.

## 15. పిండ ప్రమాణము

ఏకోద్దిష్టే సపిండే చ కపిత్థంతు విధీయతే !
నారికేళ ప్రమాణంతు ప్రత్యబ్దే మాసికే తథా !!
తీర్థే ధర్మేచ సంప్రాప్తే కుక్కుటాండ ప్రమాణతః !
మహాలయే గయాశ్రాద్ధే కుర్యాత్ ఆమలకకోపమం !!

ఏకోద్దిష్ట శ్రాద్ధంలో వెలగపండంత, ఆబ్దికాలలో మరియు మాసికాలలో కొబ్బరికాయంత పిండం ఉండాలని, తీర్థ శ్రాద్ధంలో కోడి గుడ్డు అంత ఉండాలని ప్రమాణము. గయా శ్రాద్ధంలో శమీ పత్ర ప్రమాణం చెప్పియున్నారు. శమీ పత్రమనగా జమ్మి ఆకు.

## 16. శ్రాద్ధంలో వడ్డన ఎలా చేయాలి?

మధ్యే అన్నం ప్రతిష్ఠాప్య దక్షిణే ఘృత పాయసం !
శాకాది పురతః చైవ అంతే సూపం తదైవచ !!

ముందుగా అన్నం మధ్యలో వడ్డించాలి, (శుభకార్యంలో ముందుగా అన్నం పెట్టరు. తీపి పదార్థం వడ్డిస్తారు) భోక్తకు కుడివైపు నేయి పాయసం వడ్డించాలి, కూరలు తూర్పున వడ్డించాలి, చివరికి పప్పు (కుడి వైపు) వేయాలి. (పచ్చళ్ళు, పిండి వంటలు ఎడమ వైపున వేయాలి)

## 17. ప్రాణాహుతులు ఎలా తీసుకోవాలి?

తర్జనీ మధ్యమాంగుష్ఠ లగ్నా ప్రాణాహుతిర్భవేత్ !
మధ్యమానామిక అంగుష్టేరపానే జహుయాత్తతః !!
కనిష్ఠానామికాంగుష్టః వ్యానేతు జుహుయాద్ధవిః !
తర్జనీంతు బహిః కృత్వా ఉదానే జహుయాత్తతః !
సమానే సర్వహస్తేన సముదాయాహుతిర్భవేత్ !!

అ) తర్జనీ మధ్యమ అంగుష్ఠముల చేత అనగా బొటనవేలు మధ్యవేలు చూపుడు వేళ్ళతో అన్నం తూర్పు భాగం నుండి 4 మెతుకులు తీసుకుని నోటికి పెదాలకు తగిలించకుండా ఓం ప్రాణాయ స్వాహా అని ఆహుతి గ్రహించాలి. (నమలకుండ మింగివేయాలి).

ఆ) మధ్యమ, అనామిక, అంగుష్ఠములచే అనగా మధ్యవేలు ఉంగరం వేలు బొటనవేళ్ళతో అన్నం దక్షిణ భాగం నుండి గ్రహించి ఓం అపానాయ స్వాహా అని....,

ఇ) కనిష్ఠ, అనామిక అంగుష్ఠములచేత అనగా చిటికెన వేలు ఉంగరం వేలు బొటనవేళ్ళతో అన్నం పడమర భాగం నుండి గ్రహించి ఓం వ్యానాయ స్వాహా అని...,

ఈ) చూపుడు వేలు మినహా మిగతా అన్ని వేళ్ళతో అన్నం ఉత్తర భాగం నుండి గ్రహించి ఓం ఉదానాయ స్వాహా అని...,

ఉ) అన్ని వేళ్ళు కలిపి మధ్యభాగం నుండి ఓం సమానాయ స్వాహా అని వేసుకోవాలి. (పరాశర మాధవీయం)

**18. శ్రాద్ధంలో మజ్జిగ వాడరాదు :**

పైత్రుకేషుచ విప్రేభ్యో దద్యాత్ తక్రంతు మూఢధీః !
తత్ తక్రం రక్త మిత్యాహుః కాష్యపిర్గార్గ్య గౌతమాః !!

శ్రాద్ధంలో పెరుగుకి బదులు మజ్జిగ వడ్డిస్తే ఆ మజ్జిగ రక్తంతో సమానం.

**19. పిండాలను పిల్లి, ఎలుకలు ముడితే?**

మార్జాల మూషిక స్పర్శే పిండే ద్విదళీకృతే !
పునః శ్రాద్ధం విధాతవ్యం తేన పాకేన భక్షనాత్ !

శ్రాద్ధంలో పిండాలను పిల్లి ఎలుక ముట్టినా, పిండం విరిగిపోయినా పూర్తి శ్రాద్ధాన్ని మొదటి నుండి చేయాలి.



## !! తర్పణం చేయకూడని రోజులు !!

వివాహం తర్వాత ఏడాది వరకు, ఉపనయనం తర్వాత 6 మాసాల వరకు, చౌలం తర్వాత 3 మాసాల వరకు, తిల తర్పణాలు ఆచరించరాదు. అలాగే భాను సప్తమి రోజున అనగా ఆదివారం సప్తమి కలిసి వచ్చిన రోజున, తన జన్మ నక్షత్రమందు ఆచరించరాదు. మంగళ శుక్రవారాలలో పాడ్యమి, సప్తమి, ఏకాదశి త్రయోదశి తిథులలో, తిల తర్పణం బదులు జల తర్పణం మాత్రమే చేయవలెను. రాత్రి యందు ప్రదోష కాలంలో తిల తర్పణం చేయరాదు. మాసికములలో, తీర్థ శ్రాద్ధంలో, గయా శ్రాద్ధంలో సపిండీకరణములో, ప్రత్యాబ్దికమునందు తిల తర్పణములు ఆచరించరాదు. అలాగే గృహమందు కూడా ఎప్పుడూ తిలతర్పణం ఆచరించకూడదు. తులసికోట ముందు కానీ ఇంటి బయట గానీ నదీ తీరమునందు గానీ దక్షిణాభి ముఖులై ఆచరించవలెను అని శాస్త్రము. కానీ, వసతిలేని వారు గృహము నందు తర్పణము ఆచరించడము ఏమాత్రము దోషముకాదని **"బ్రహ్మ శ్రీ మాడుగుల మాణిక్య సోమయాజుల గురువు గారు"** తెలియజేసి ఉన్నారు. కావున తర్పణములు ఆచరించువారు తమ వసతిని బట్టి చేసుకోవచ్చు అని గమనించగలరు.

తిలలు నిత్య తర్పణంలో విధిగా ఉండవలెను. అది అక్షయమగును. తర్పణము కుశలు పరచిన స్థలమందు గానీ, తామ్ర పాత్ర యందు గానీ ఆచరించాలి. తర్పణం వదిలే సమయంలో పవిత్రను ధరించి ఉండాలి. ఈ పవిత్ర బంగారంతో వెండితో తామ్రం తో లేదా దర్భలతో చేసి ధరించవచ్చు. హస్తముతో తర్పణం ఒకరెట్టి ఫలితం, దర్భలతో నూరింతలు ఫలం.

# మహాలయంలో పిండాలను పెట్టే క్రమ పట్టిక

పిండస్థాన బోధక పట్టికా

దక్షిణము

సఖా

రిక్థీ

గురుః

శ్వశురః స్యాలకః శ్వశ్రూః

తద్భర్తా తత్పుత్రః పితృ భగినీ

భావుకః భాగనయః ఆత్మ భగినీ

తద్భర్తా తత్పుత్రః మాతృ భగినీ జామాతా దౌహిత్రః దుహితా

మాతృ ప్రపితామహః మాతృ ప్రపితామహీ ప్రపితా మహః ప్రపితా మహీ

మాతృ పితామహః మాతృ పితామహీ పితా మహః పితృవ్యః పితామహి

మాతామహః మాతులః తత్పత్నీ మాతా మహీ పితా భ్రాతా సుతఃస్నుషా మాతా సాపత్న మాతా

ఆత్మ పత్నీ

పశ్చిమ

పూర్వము

ఉత్తరము

## శ్రాద్ధంలో పనికివచ్చే, పనికి రాని పదార్థాలు

| పనికి వచ్చేవి | | వర్జితమైనవి |
|---|---|---|
| అరటికాయ | పెసర పప్పు | కందిపప్పు |
| పొట్లకాయ | మినుములు | అలచందలు / బొబ్బెర |
| దోసకాయ | గోధుమలు | ఉలవలు |
| బీరకాయ | దానిమ్మ | కొర్రలు |
| కాకరకాయ | ద్రాక్ష | జొన్నలు |
| పనసకాయ | ఖర్జూరం | వంకాయలు |
| గుమ్మడికాయ | మామిడి | బూడిద గుమ్మడి |
| కొబ్బరికాయ | అరటి | సొరకాయ |
| కంద, దబ్బకాయ | | జామకాయ |
| ముళ్ళ వంకాయ | | మునగ |



## !! మహాలయం ప్రాధాన్యం !!

భాద్రపదమాసంలోని శుక్లపక్షం దేవతా పూజలకు ఎంత విశిష్టమైనదో, బహుళ పక్షం పితృదేవతా పూజలకు అంత శ్రేష్ఠమైనది. పితృదేవతలకు ప్రీతికరమైన పక్షం గనుక దీనికి పితృపక్షమని, మహాలయ పక్షమని పేరు. ఈ పక్షం ముగిసే వరకు ప్రతిరోజూ పితృదేవతలకు తర్పణ, శ్రాద్ధ విధులను నిర్వహించాలి.

తండ్రి యొక్క పుణ్యతిథి రోజునే తమ పితృదేవతలందరికీ శ్రాద్ధం పెట్టడం జరుతుంది. తండ్రి జీవించి తల్లి మృతి చెంది ఉంటే... కేవలం నవమి నాడు మాత్రమే శ్రాద్ధ విధులను ఆచరించాలి. ఈ నవమిని "అవిధవా నవమి" అంటారు. తల్లీ తండ్రీ లేనివారు ఈ పక్షాన తప్పక పితృకర్మలు చేయాలి. ఈ పక్షమంతా చేయలేని వారు ఒక్క మహాలయ అమావాస్యనైనా చేసి తీరాలి.

సూర్యుడు కన్యారాశిలో ప్రవేశించగానే పితరులు తమ పుత్ర, పౌత్రుల దగ్గరకు వస్తారని చెప్పబడింది. మహాలయ అమావాస్యనాడు వారు తమ సంతతి ద్వారం దగ్గరే నిలబడతారు. ఆరోజు వారికి శ్రాద్ధకర్మ నిర్వర్తించకపోతే దీవెనకు బదులుగా శపించి వెళ్లిపోతారు. నిజానికి, ప్రతి మాసంలోను అమావాస్య పితరుల పుణ్యతిథిగా భావించబడినా, మహాలయ అమావాస్యకు విశేష ప్రాముఖ్యత ఉంటుంది. ఈ రోజు సమస్త పితృదేవతా విసర్జనం జరుగుతుంది. తమ పితరుల పుణ్యతిథి వివరాలు తెలియనివారు, పితృపక్షంలో ఆ తిథినాడు కారణవశాన శ్రాద్ధం పెట్టలేనివారు మహాలయ అమావాస్యనాడు శ్రాద్ధం, దానం, తర్పణం చేస్తారు. ఎవరూ శ్రాద్ధ విముఖులు కాకూడదు. శ్రాద్ధ మహిమను శాస్త్రాలు విస్తృతంగా పేర్కొన్నాయి. శ్రాద్ధం చేయటం వల్ల సంతానం ప్రాప్తిస్తుందని స్కాంద

పురాణంలో చెప్పబడింది. ఆదర పూర్వకంగా శ్రాద్ధ కర్మతో సంతోషపెడితే వారు తమ సంతతి యొక్క ఆయువు, విద్య, ధనం, సంతానం, సమస్తం కలిగి ఉండేట్టు ఆశీర్వదిస్తారు. అన్ని దానాలలోను అన్నదానం ప్రధానమైనది. అన్నదానం ఎప్పుడు చేసినా మంచి ఫలితాన్నే ఇస్తుంది కాని, ఈ మహాలయ పక్షంలో చేసే అన్నదానం వలన అనంతకోటి యజ్ఞ ఫలితం ప్రాప్తిస్తుంది. కర్ణుడు మహాలయంలో అన్నదానం చేసి సద్గతిని పొందినాడు. అలాగే మఖా నక్షత్రం పితరులకు సంబంధించింది కనుక ఆ రోజు చేసిన శ్రాద్ధ కర్మ అక్షయ ఫలాన్నిస్తుంది.

ఆర్థిక భారం వలన విద్యుక్తంగా శ్రాద్ధ కర్మలు చేయలేకపోతే, పితృ పక్షంలో కేవలం శాఖంతో శ్రాద్ధం చేయవచ్చు. అది కూడా వీలుకాకపోతే గోవుకు గ్రాసం పెట్టవచ్చు, అదీ చేయలేనివారు ఒక నిర్జన ప్రదేశంలో నిల్చొని అపరాహ్ణ సమయంలో రెండు చేతులూ ఆకాశం వైపు పైకి ఎత్తి, పితృ దేవతలకు నమస్కరించవచ్చు. శ్రాద్ధ కర్మ చేత పితృ దేవతలకు సంతృప్తి కలిగించిన వ్యక్తికి భౌతికంగా సుఖ సంతోషాలు, పరలోకంలో ఉత్తమ గతులు లభిస్తాయని శాస్త్రాల ద్వారా తెలుస్తోంది.



## కర్ణుడు - మహాలయం

దానశీలిగా పేరుపొందిన కర్ణుడికి మరణానంతరం స్వర్గం ప్రాప్తించింది. ఆయన స్వర్గలోకానికి వెళుతుండగా మార్గమధ్యంలో ఆకలి, దప్పిక కలిగాయి. ఇంతలో ఒక ఫలవృక్షం కనిపించింది. పండుకోసుకుని తిందామని నోటి ముందుం చుకున్నాడు. ఆశ్చర్యం! ఆ పండు కాస్తా బంగారపు ముద్దగా మారిపోయింది. ఆ చెట్టుకున్న పండ్లే కాదు, మిగతా ఏ చెట్టు పండ్లు కోయబోయినా అదే అనుభవం ఎదురైంది. ఇలా లాభం లేదనుకుని కనీసం దప్పికయినా తీర్చుకుందామనుకుని సెలయేటిని సమీపించి దోసిట్లోకి నీటిని తీసుకుని నోటి ముందుంచుకున్నాడు. ఆ నీరు కాస్తా బంగారపు నీరుగా మారిపోయింది. స్వర్గలోకానికివెళ్లాక అక్కడ కూడా అదే పరిస్థితి ఎదురైంది. దాంతో కర్ణుడు తాను చేసిన తప్పిదమేమిటి? తనకిలా ఎందుకు జరుగుతున్నదని వాపోతుండగా “కర్ణా! నీవు దానశీలిగా పేరు పొందావు. చేతికి ఎముక లేకుండా దానాలు చేశావు. అయితే ఆ దానాలన్నీ బంగారం, వెండి, ధనరూపేణా చేశావు గానీ, కనీసం ఒక్కరికి కూడా అన్నం పెట్టి ఆకలి తీర్చలేదు. అందుకే నీకీ దుస్థితి ప్రాప్తించింది” అని అశరీరవాణి పలుకులు వినిపించాయి. కర్ణుడు తన తండ్రి అయిన సూర్యదేవుని వద్దకెళ్లి పరిపరివిధాల ప్రాధేయపడగా, ఆయన కోరిక మేరకు దేవరాజయిన ఇంద్రుడు కర్ణునికి ఒక అపురూపమైన అవకాశమిచ్చాడు. నీవు వెంటనే భూలోకానికెళ్లి అక్కడ అన్నార్తులందరికీ అన్నం పెట్టి, మాతా పితరులకు తర్పణాలు వదిలి తిరిగి రమ్మన్నాడు.

ఆ సూచన మేరకు కర్ణుడు భూలోకానికి చేరాడు. అక్కడ పేదలు, బంధుమిత్రులు అందరికీ అన్నసంతర్పణ చేశాడు. పితరులకు

తర్పణాలు వదిలాడు. తిరిగి స్వర్గానికెళ్లాడు.

ఎప్పుడైతే కర్ణుడు అన్న సంతర్పణలు, పితృతర్పణలు చేశాడో అప్పడే ఆయనకు కడుపు నిండిపోయింది, ఆకలి తీరింది. అది అన్నదానం గొప్పతనం

అందుకే ఎంతటివారైనా తమకున్నంతలో మహాలయములను ఆచరించి తరించమన్నారు.





# మహాలయ పక్షంలో ఇలా చేయకూడదా??

**ఈ 15 రోజుల గురించి జనాలలో ఉన్న రకరకాల అపోహలు:**

ఈ రోజులు అదేదో మహా పాపం అన్నట్లు, ఏదీ చేయకూడదు అని, ఏదైనా చేస్తే ఏదో ఘోరం జరిగిపోతుందేమో అన్నట్లు ప్రజల మనస్సులో ఒక భయంకరమైన అపోహ ఉంది. ఇది నిజంగా చాలా దారుణం. ఒక వైపు ప్రజల్లో భక్తి భావం పెరుగుతుంటే అంతే సమాన స్థాయిలో మూఢనమ్మకాలు చాందసాలు అపోహలు కూడా అధికం అవుతున్నాయి. పై పెచ్చు ఎవరైనా ఏదైనా పని చేసినా వారిని “గో హత్య” చేసిన వారిలా ఎంత ఘోరం చేసారండి ఇవి మహాలయాలు కదా పీడ రోజుల్లో చేస్తారా? ఎంత దారుణం అంటూ ఎగతాళి చేసే వారు ఎంతోమంది.

మహాలయ రోజుల్లో మనకు శాస్త్రం గతించిన మన పితృ దేవతలను స్మరిస్తూ వారికి పిండోదకాలు ఇవ్వమని చెప్పింది కానీ మిగతా ఏ పనులూ చేయకూడదు అని చెప్పలేదు. ఇక్కడ మరో విషయం కూడా మనం గమనించాలి. పితృదేవతలను ఈ 15 రోజులు స్మరించి మిగతా రోజుల్లో మరచిపోమ్మని కాదు. ప్రతిరోజూ గుర్తుంచుకోవాలి ఈ పక్షంలో అధికముగా చేయాలి.

**అయితే ఇక్కడ వచ్చిన చిక్కేంటి అంటే...?**

ఈ రోజుల్లో బట్టలు కొనరాదు అని, బంగారం కొనకూడదు అని, ఇల్లు మారకూడదు అని, కొన్ని పనులకు అడ్వాన్స్‌లు ఇవ్వకూడదు అని, రిజిష్ట్రేషన్‌లు చేసుకోరాదని, దూర ప్రయాణాలు చేయరాదని ఇలా అనేక అపోహలు ఉన్నాయి. వీటిలో ఏ మాత్రం నిజం లేదు.

**ఒక్కసారి ఆలోచించండి....**

ఈ పక్షంలో బర్త్‌డేలు మ్యారేజ్ డేలు ఆచరించడం వాయిదా వేస్తున్నారా?

మరి మిగతా వాటికి ఎందుకు అంతటి జాడ్యాన్ని ప్రదర్శిస్తున్నారు?

మహాలయంలో ముహూర్తాలు ఉండవు. కనుక శుభకార్యాలు చేసుకోము అంతే కాని అన్నీ మానేసుకోవడం అనేది అర్థరహితం.

"భగవద్గీత మరియు గరుడ పురాణం" లకి కూడా ఇలాంటి దుస్థితే వచ్చింది.

చనిపోయినప్పుడు వినమన్నారు చదవమన్నారు అంటే దాని అర్థం బతికున్నప్పుడు మానేయండి అని కాదు కదా...?

ఒకసారి ఆలోచించండి....!



# పితృ దేవతా స్తుతి

బృహధర్మ పురాణంలో బ్రహ్మ దేవుడు చేసిన పితృస్తుతి

నమో పిత్రే జన్మ దాత్రే.
సర్వ దేవ మయాయచ
సుఖదాయ ప్రసన్నాయ
సుప్రీతాయ మహాత్మనే

సర్వయజ్ఞ స్వరూపాయ
స్వర్గయా పరమేష్ఠినే
సర్వ తీర్థావ లోకాయ
కరుణా సాగరాయ చ

నమో సదాశుతోషాయ
శివ రూపాయతే నమః
సదాపరాధ క్షమినే
సుఖాయ సుఖదాయచ.

దుర్లభం మానుషమిదం
యేనలబ్ధం మయామిదం
సంభావనీయం ధర్మార్థే
తస్మై పిత్రే నమో నమః.

తీర్థస్నాన తపోహోమ
జపాదీన్ యస్య దర్శనం
మహా గురోశ్చ గురువే
తస్మై పిత్రే నమో నమః

యస్య ప్రాణామస్తవనాథ్
కోటీసః పితృ తర్పణం
అశ్వమేధస్తైః తుల్యం
తస్మై పిత్రే నమోనమః.

ఫల శృతి :- ఈ స్తోత్రాన్ని శ్రాద్ధ దినములందే కాక ప్రతి రోజు ఎవరు పఠిస్తారో, వారికి ఈతి బాధలు ఉండవు.
ఎవరైనా పితృదేవతల విషయములో తప్పు చేసినా, అంటే శ్రాద్ధము జరుపకపోయిన, పశ్చాత్తాపముతో ఈ స్తోత్రాన్ని పఠించిన ప్రాయశ్చిత్తం జరిగి వారిని పితృదేవతలు అనుగ్రహిస్తారు.
పుట్టినరోజునాడు ఎవరైతే తండ్రికి నమస్కరించి పఠిస్తారో వారికి పితృదేవతల ఆశీస్సులు అందుతాయి.



# యజ్ఞోపవీత ధారణ విధి

**గణేశ స్తోత్రం**

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణమ్ చతుర్భుజమ్।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోపశాంతయే॥
అగజానన పద్మార్కం గజానన మహర్నిశమ్।
అనేక దంతం భక్తానా-మేకదంత-ముపాస్మహే॥

**గురు శ్లోకం**

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః।
గురుః సాక్షాత్ పరబ్రహ్మ తస్మైశ్రీ గురవే నమః॥

**సరస్వతీ శ్లోకం**

సరస్వతీ నమస్తుభ్యం వరదే కామరూపిణీ।
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా॥

ఆచమనం:

ఓం కేశవాయ స్వాహా ఓం నారాయణాయ స్వాహా
ఓం మాధవాయ స్వాహా

**(చప్పడు కాకుండా మినప గింజ అంత నీటిని స్వాహా శబ్దంతో తాగాలి.)**

ఓం గోవిందాయ నమః (పాణిం మార్జయిత్వా)
ఓం విష్ణవే నమః
ఓం మధుసూదనాయ నమః (ఓష్ఠౌ మార్జయిత్వా)
ఓం త్రివిక్రమాయ నమః
ఓం వామనాయ నమః (శిరసి జలం ప్రోక్ష్య)
ఓం శ్రీధరాయ నమః

ఓం హృషీకేశాయ నమః (వామహస్తె జలం ప్రోక్ష్య)
ఓం పద్మనాభాయ నమః (పాదయోః జలం ప్రోక్ష్య)
ఓం దామోదరాయ నమః (శిరసి జలం ప్రోక్ష్య)
ఓం సంకర్షణాయ నమః (అంగుళిభిః చుబుకం జలం ప్రోక్ష్య)
ఓం వాసుదేవాయ నమః
ఓం ప్రద్యుమ్నాయ నమః (నాసికం స్పృష్ట్వా)
ఓం అనిరుద్ధాయ నమః
ఓం పురుషోత్తమాయ నమః
ఓం అధోక్షజాయ నమః
ఓం నారసింహాయ నమః (నేత్రే శ్రోత్రే చ స్పృష్ట్వా)
ఓం అచ్యుతాయ నమః (నాభిం స్పృష్ట్వా)
ఓం జనార్దనాయ నమః (హృదయం స్పృష్ట్వా)
ఓం ఉపేంద్రాయ నమః (హస్తం శిరసి నిక్షిప్య)
ఓం హరయే నమః
ఓం శ్రీకృష్ణాయ నమః

ఉత్తిష్ఠంతు భూతపిశాచాః ఏతే భూమి భారకాః
ఏతేషామవిరోధేన బ్రహ్మకర్మ సమారభే.
(శ్లోకము చదివి - అక్షతలు కొన్ని వాసన చూసి తలపై నుండి
వెనుకకు వేసుకోవాలి.)

ప్రణవస్య పరబ్రహ్మ ఋషిః పరమాత్మా దేవతా దైవీ గాయత్రీచ్ఛందః
ప్రాణాయామే వినియోగః

ఓం భూః | ఓం భువః | ఓం సువః | ఓం మహః | ఓం జనః |
ఓం తపః | ఓం సత్యమ్ | ఓం తత్స -- ప్రచోదయాత్ ||
( గాయత్రి మంత్రం బహిర్గతం చేయకూడదు అని రాయలేదు. )

ఓమాపో జ్యోతీ రసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్||
మమోపాత్త సమస్త దురిత క్షయ ద్వారా, శ్రీ పరమేశ్వర ముద్దిశ్య,

# సంకల్పమ్

శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం,
శుభాభ్యాం శుభే శోభనే మంగళే ముహూర్తే, శ్రీ మహా విష్ణోరాజ్ఞయా, ప్రవర్తమానస్య, అద్య బ్రహ్మణః ద్వితీయ పరార్థే, శ్వేతవరాహ కల్పే, వైవస్వత మన్వంతరే, అష్టావింశతితమే కలియుగే, ప్రథమ చరణే, జంబూ ద్వీపే, భరత వర్షే, భరత ఖండే, మేరోః దక్షిణేతీరే, శ్రీశైలస్య వాయువ్య ప్రదేశే, శ్రీ కృష్ణా గోదావర్యోః మధ్య ప్రదేశే శాలీ వాహన శకే, బౌద్ధావతారే, ---- క్షేత్రే (మీ దగ్గరలోని క్షేత్రం పేరు చెప్పుకోవాలి) సమస్త దేవతా బ్రాహ్మణ హరిహర గురుచరణ సన్నిధౌ, అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన స్వస్తిశ్రీ... నామ సంవత్సరే (సం.రం. పేరు చెప్పకోవాలి ---- అయనే (ఉత్తరాయనం / దక్షిణాయనం), ---- ఋతౌ (ఋతువు పేరు), ---- మాసే (మాసం పేరు), --- పక్షే, (శుక్ల/కృష్ణ) ... తిథౌ, (ఆ రోజున్న తిథి) ... వాసరే, (వారం పేరు), శుభ నక్షత్ర, శుభ యోగ, శుభ కరణ, ఏవంగుణ, విశేషణ, విశిష్టాయాం శుభతిథౌ శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం ... గోత్రోత్పన్న, (మీ గోత్రం చెప్పకోవాలి) ... శర్మ నామధేయస్య, (మీ పేరు) మమ శ్రౌత స్మార్త విధివిహిత, నిత్యకర్మ సదాచార అనుష్ఠాన యోగ్యతా సిద్ధ్యర్థం (జాతా శౌచ, మృతా శౌచ జనిత దోష ప్రాయశ్చిత్తార్థం.. అశౌచం సందర్భంలో మాత్రమే చెప్పాలి) బ్రహ్మతేజోభివృద్ధ్యర్థమ్, శ్రీ లక్ష్మీనారాయణ ప్రేరణయా, శ్రీ లక్ష్మీ నారాయణ ప్రీత్యర్థమ్ పరమ పవిత్ర నూతన యజ్ఞోపవీత ధారణం కరిష్యే.
(అక్షింతలు నీళ్ళు, వదిలేయాలి) తదంగ కలశ గణాధిపతి ప్రార్థనం కరిష్యే...!

రాగి / ఇత్తడి / వెండి చెంబులో నీటిని తీసుకొని ఆ కలశాన్ని అలంకరించి పూజించాలి.

కలశస్య ముఖే విష్ణుః కంఠే రుద్రస్సమాశ్రితః
మూలే తత్ర స్థితో బ్రహ్మో మధ్యే మాతృ గణాస్మృతాః
కుక్షౌతు సాగరాస్సర్వే సప్త ద్వీపా వసుంధరా
ఋుగ్వేదోథ యజుర్వేద స్సామవేదోః అధర్వణః
అంగైశ్చ సహితాస్సర్వే కలశాంబు సమాశ్రితాః
గంగేచ యమునేచైవ గోదావరి సరస్వతీ
నర్మదా సింధు కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు
ఆయాంతు నూతన యజ్ఞోపవీత పూజార్థం దురితక్షయ కారకాః

( కొంచెం కలశంలోని జలమును యజ్ఞోపవీతం మీద పూజా ద్రవ్యాల మీద చల్లుతూ) పూజా ద్రవ్యాణి (దేవుడి మీద చల్లి) దేవం (తమ మీద చల్లుకుని ) ఆత్మానం సంప్రోక్ష్య.

**గణపతి ప్రార్థనం !**

వక్రతుండ మహాకాయ కోటి సూర్యసమప్రభ !
నిర్విఘ్నం కురుమేదేవా సర్వకార్యేషు సర్వదా !!
గణానాంత్వా ... సాదనం !

మహా గణపతయే నమః ప్రార్థన నమస్కారం సమర్పయామి.
అథ యజ్ఞోపవీత సంస్కార సహిత పూజాం కరిష్యే !
(నీటిని వదిలేయాలి)
యజ్ఞోపవీతంను ఎడమ అరచేతిలో ఉంచుకొని, దానిమీద కుడిచేయిని ఉంచాలి.

1. ఓం బ్రహ్మజజ్ఞానం ... తశ్చ వివః !

(ఈ మంత్రం చెప్పి సూత్రీకరణం చేసినట్లు భావించాలి. మంత్రం రాని వారు "ఓం బ్రహ్మణే నమః" అని చెప్పకోవాలి)

2. ఓం ఇదం విష్ణుః ... సరే !

(ఈ మంత్రం చెప్పి దారములను లెక్కించినట్లు భావించాలి.

మంత్రం రాని వారు "ఓం విష్ణవే నమః" అని చెప్పకోవాలి)

3. ఓం కద్రుద్రాయ ... హృదే !

(ఈ మంత్రం చెప్పి బ్రహ్మ గ్రంథి వేసినట్లు భావించాలి. మంత్రం రాని వారు "ఓం రుద్రాయ నమః" అని చెప్పుకోవాలి)

యజ్ఞోపవీతాన్ని పళ్ళెంలో పెట్టి కింది మంత్రాలు చెబుతూ నీళ్ళతో ప్రక్షాళన చేయాలి. మంత్రం రానివారు అపవిత్రః... అనే శ్లోకం చెప్పాలి.

ఓం ఆపోహిష్ఠా... యధాచనః !

ఓం హిరణ్యవర్ణాశ్శుచయః ... నిధత్త !

ఓం పవమానస్సువర్జనః ... !

అపవిత్రః ప్రవిత్రోవా సర్వావస్థాం గతోపివా !

యస్మరేత్ పుండరీకాక్షం సబాహ్యాః అభ్యంతరః శుచిః !!

ప్రక్షాళన చేసిన ఉపవీతాన్ని శుభ్రం చేసి పళ్ళెంలో ఉంచి ఈ కింది మంత్రాలు / నామాలు చెబుతూ అక్షింతలు వేస్తుండాలి.

**నవతంతు దేవతాహ్వానం:**

ఓంకారోగ్నిశ్చ నాగశ్చ సోమః పితృ ప్రజాపతీ !

వాయుస్సూర్యో విశ్వేదేవాః ఇత్యేతాస్తంతు దేవతాః !!

1. మం. ఓం తత్ బ్రహ్మ ..... వస్సువరోం !!

(మంత్రం వచ్చినవారు మంత్రం చెప్పకోవాలి, మంత్రం రానివారు కింది నామాన్ని చెప్పుకుంటే సరిపోతుంది.)

ఓం ఓంకారాయ నమః

ప్రథమ తంతౌ ఓం కారమావాహయామి.

2. మం. ఓం అగ్నిం దూతం .... సుక్రతుం !!

ఓం అగ్నయే నమః, ద్వితీయ తంతౌ అగ్నిమావాహయామి.

3. మం. ఓం నమో అస్తు సర్వేభ్యో .... భ్యో నమః !!

ఓం నాగాయ నమః, తృతీయ తంతౌ నాగం ఆవాహయామి.

4. మం. ఓం ఆప్యాయ స్వస.... సంగధే !!

ఓం సోమాయ నమః, చతుర్థ తంతౌ సోమమావాహయామి.

5. మం. ఓం యేచేహ పితరో ... జుశంతాం !!

ఓం పితృభ్యో నమః, పంచమ తంతౌ పిత్రూన్ ఆవాహయామి

6. మం. ఓం ప్రజాపతే నత్వ ... రయీనాం !!

ఓం ప్రజాపతయే నమః, షష్ఠమ తంతౌ ప్రజాపతిమావాహయామి.

7. మం. ఓం తవ వాయ .... వృణీమహే !!

ఓం వాయవే నమః, సప్తమ తంతౌ వాయుమావాహయామి.

8. మం. ఓం ఆసత్యేన రజసా ... పశ్యన్ !!

ఓం సూర్యాయ నమః, అష్టమ తంతౌ సూర్యమావాహయామి.

9. మం. ఓం విశ్వేదేవా స ఆగత .... నిశీదత !!

ఓం విశ్వేభ్యో దేవేభ్యో నమః, నవమ తంతౌ విశ్వేదేవాన్ ఆవాహయామి.

మం. ఓం అగ్నిమీళే పురోహితం ...... ధాతమం

ఓం ఋగ్వేదాయ నమః, బ్రహ్మ దైవత్యమితి ఋగ్వేదం ప్రథమ దోరకే న్యసామి.

మం. ఓం ఇషేత్వోర్జేత్వా .... కర్మనే !!

ఓం యజుర్వేదాయ నమః, విష్ణు దైవత్యమితి యజుర్వేదం ద్వితీయ దోరకే న్యసామి

మం. ఓం అగ్న ఆయాహి ... బర్హిషి !!

ఓం సామవేదాయ నమః, రుద్ర దైవత్యమితి సామవేదం తృతీయ దోరకే న్యసామి

మం. ఓం శన్నోదేవిరభిష్టయ... వంతునః!!

ఓం అథర్వణ వేదాయ నమః, సర్వ దైవత్యమితి అథర్వణ వేదం బ్రహ్మ గంథౌ న్యసామి

మం. ఓం బ్రహ్మ జజ్ఞానం .... వివః !!

ఓం బ్రహ్మణే నమః, ప్రథమ గ్రంథౌ బ్రహ్మాణమావాహయామి.

మం. ఓం ఇదం విష్ణు ... సురే !!

ఓం విష్ణవే నమః, ద్వితీయ గ్రంథౌ విష్ణుమావాహయామి.

మం. ఓం కద్రుద్రాయ ప్రచేతసే ... హృదే !!

ఓం రుద్రాయ నమ, తృతీయ గ్రంథౌ రుద్రమావాహయామి.

బ్రహ్మ విష్ణు మహేశ్వర దేవతాభ్యో నమః గ్రంధి మధ్యే ఆవాహయామి.

(బ్రహ్మచారులు పై 3 మంత్రాలు వరుసగా చెప్పి బ్రహ్మ విష్ణు మహేశ్వర దేవతాం బ్రహ్మ గంధిం ఆవాహయామి అని చెప్పాలి. ఎందుకంటే బ్రహ్మచారులకు ఒక యజ్ఞోపవీతం మాత్రమే. అందులో ఒక గ్రంధి మాత్రమే ఉంటుంది కనుక ఒకే గ్రంథిలో బ్రహ్మ విష్ణు మహేశ్వర దేవతలను ఆవాహన చేయాలి. గృహస్థులు విడివిడిగా 3 పోగులు ధరిస్తారు కనుక విడివిడిగా ఒక్కో గ్రంథిలో బ్రహ్మ విష్ణు మహేశ్వర దేవతలను ఆవాహన చేయాలని గ్రహించగలరు. బ్రహ్మ విష్ణు మహేశ్వర మంత్రములు సుస్వరముగా వచ్చినవారు ఇక్కడ ఆ మంత్రములు చెప్పు కొనగలరు).



# అథ యజ్ఞోపవీత పూజ !

ఓం అస్యశ్రీ ప్రాణ ప్రతిష్ఠాపన మహామంత్రస్య, బ్రహ్మా విష్ణు
మహేశ్వరా ఋషయః ఋగ్యజస్సామాధర్వణాని ఛందాంసి !
ప్రాం బీజం, హ్రీం శక్తిః, క్రోం కీలకం
ప్రాణ ప్రతిష్ఠాపన సిధ్యర్థే జపే వినియోగ.

**కరన్యాసం:**

ఓం హ్రాం అంగుష్ఠాభ్యాం నమః
ఓం హ్రీం తర్జ నీభ్యాం నమః
ఓం హ్రూం మధ్యమాభ్యాం నమః
ఓం హ్రైం అనామికాభ్యాం నమః
ఓం హ్రౌం కనిష్ఠికాభ్యాం నమః
ఓం హ్రః కరతలకర పృష్ఠాభ్యాం నమః

**అంగన్యాసం:**

ఓం హ్రాం హృదయాయ నమః
ఓం హ్రీం శిరసే స్వాహా
ఓం హ్రూం శిఖాయై వషట్
ఓం హ్రైం కవచాయ హుం
ఓం హ్రౌం నేత్ర త్రయాయ వౌషట్
ఓం హ్రః అస్త్రాయ ఫట్
భూర్భువస్సు వరోం ఇతి దిగ్బంధః

**ధ్యానం !**

ప్రజాపతే యత్సహజం పవిత్రం కార్పాస సూత్రోద్భవ బ్రహ్మ సూత్రం
బ్రహ్మత్వ సిధ్యైచ యశః ప్రకాశం జపస్య సిద్ధిం కురు బ్రహ్మ సూత్రం

ముక్తా విద్రుమ హేమ నీల ధవళచ్ఛాయైః ముఖైః, త్ర్యక్షణైః
యుక్తామిందు నిబద్ధ రత్న మకుటాం తత్త్వార్థవర్ణాత్మికాం,
గాయత్రీం వరదా భయాంకుశ కశా శ్శుభ్రం కపాలం గదాం
శంఖం చక్రమథారవింద యుగళం హస్తైర్వహంతీం భజే

ఆయాతు వరదా దేవీ అక్షరం బ్రహ్మ సంహితమ్
గాయత్రీం ఛందసాం మాతేదం బ్రహ్మ జుషస్వ మే
సర్వ వర్ణే మహాదేవి సంధ్యావిద్యే సరస్వతి !!

ఓం ఓజో౾సి సహో౾సి బలమసి భ్రాజో౾సి దేవానాం ధామనామాసి విశ్వమసి విశ్వాయుః సర్వమసి సర్వాయుః అభిః భూరోమ్ గాయత్రీ మావాహయామి, సావిత్రీమావాహయామి సరస్వతీ మావాహ యామి!!

మం॥ అసునీతే ... ముపహ్వయతే !
ధ్యానం ప్రాణప్రతిష్ఠాపనం సమర్పయామి.
(పళ్ళెంలో ఉన్న యజ్ఞోపవీతంపై అక్షతలు వేసి నమస్కరించాలి).

ఓం లం పృథివీ తత్త్వాత్మికాయై శ్రీ గాయత్రీ పరదేవతా సహిత ప్రణవాద్యావాహిత దేవతాభ్యో నమః గంధం పరికల్పయామి
ఓం హం ఆకాశ తత్త్వాత్మికాయై శ్రీ గాయత్రీ పరదేవతా సహిత ప్రణవాద్యావాహిత దేవతాభ్యో నమః పుష్పం పరికల్పయామి
ఓం యం వాయు తత్త్వాత్మికాయై శ్రీ గాయత్రీ పరదేవతా సహిత ప్రణవాద్యావాహిత దేవతాభ్యో నమః ధూపం పరికల్పయామి
ఓం రం తేజః తత్త్వాత్మికాయై గాయత్రీ పరదేవతా సహిత ప్రణవాద్యావాహిత దేవతాభ్యో నమః దీపం పరికల్పయామి
ఓం వం అమృత తత్త్వాత్మికాయై శ్రీ గాయత్రీ పరదేవతా సహిత ప్రణవాద్యావాహిత దేవతాభ్యో నమః నైవేద్యం పరికల్పయామి
ఓం సం సర్వ తత్త్వాత్మికాయై శ్రీ గాయత్రీ పరదేవతా సహిత

ప్రణవాద్యావాహిత దేవతాభ్యో నమః తాంబూలాది సర్వ ఉపచారాన్ పరికల్పయామి.

యజ్ఞోపవీతం ఇతి మంత్రస్య, పరబ్రహ్మ ఋషిః పరమాత్మా దేవతా, త్రిష్టుప్ ఛందః. యజ్ఞోపవీత ధారణే వినియోగః

(బ్రహ్మచారి ఒక పోగును మాత్రమే ధరించాలి, గృహస్థు మూడు ధరించాలి. ముందుగా సూర్యనారాయణుడికి చూపించాలి, తరువాత బ్రహ్మముడి అర చేతుల యందు వుంచి ఈ క్రింది మంత్రమును పఠిస్తూ మొదటి పోగును ధరించాలి.)

1. మం. ఉదుత్యం జాతవేదసం .... సూర్యం !!
ఓం ఉదయగిరిముపేతం భాస్కరం పద్మహస్తం
సకలభువననేత్రం రత్నరజ్జూపమేయమ్
తిమిరకరిమృగేంద్రం బోధకం పద్మినీనాం
సురవరమభివంద్యం సుందరం విశ్వదీపమ్

ఆచమ్య...!

అ) మమ శ్రౌత స్మార్త విధివిహిత, నిత్యకర్మ సదాచార అనుష్ఠాన యోగ్యతా సిద్ధ్యర్థం, పరమ పవిత్ర ప్రథమ యజ్ఞోపవీత ధారణం కరిష్యే...! (నీళ్ళు వదిలేయాలి)

## యజ్ఞోపవీత ధారణ మంత్రం

యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేః యత్సహజం పురస్తాత్
ఆయుష్యమగ్ర్యం ప్రతిముంచ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః !!

(కింది 'ఆ' మరియు 'ఇ' విషయాలు కేవలం గృహస్థులు మాత్రమే ఆచరించాలి. బ్రహ్మచారులు 'ఈ' అనే అంశం నుండి ఆచరించాలి.)

తిరిగి ఆచమనము చేయాలి, గాయత్రి మంత్రమును పఠించాలి.

ఆ) రెండవ పోగు మంత్రం : మమ గృహస్థాశ్రమ నిర్వహణ యోగ్యతా సిద్ధ్యర్థం ద్వితీయ యజ్ఞోపవీత ధారణం కరిష్యే !

యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేః యత్సహజం పురస్తాత్
ఆయుష్యమగ్ర్యం ప్రతిముంచ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః

తిరిగి ఆచమనము చేసి, గాయత్రి మంత్రమును పఠించాలి.

ఇ) మూడవ పోగు మంత్రం : మమ ఉత్తరీయ అభావ దోష నివృత్తి అర్థం తృతీయ యజ్ఞోపవీత ధారణం కరిష్యే !

యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేః యత్సహజం పురస్తాత్
ఆయుష్యమగ్ర్యం ప్రతిముంచ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః !!

ఈ) తిరిగి ఆచమనము చేయాలి. (పాత కొత్త ఉపవీతములను కలిపి 10 సార్లు గాయత్రి జపం చేయడం కొన్ని ప్రాంతాల్లో ఆచరణలో ఉంది. మీకూ ఉంటే చేయండి)

## యజ్ఞోపవీత విసర్జన మంత్రం

బ్రహ్మా విష్ణు మహేశాద్యాః తంతూనాం దేవాతాస్మృతాః !
త్యక్ష్యామి పుణ్యకార్యేస్మిన్ భవతాం తృప్తి హేతవే !!
జీర్ణత్వాత్ త్వత్ పరిత్యాగః గచ్ఛ సూత్ర యధాసుఖం !!
ఉపవీతమ్ ఛిన్నతంతుం జీర్ణం కశ్మల దూషితం !
విసృజామి యశో బ్రహ్మో వర్చో దీర్ఘాయురస్తుమే !!
ఏతావద్దిన పర్యంతం బ్రహ్మత్వం ధారితం మయా !
జీర్ణత్వాత్ త్వత్ పరిత్యాగో గచ్ఛ సూత్ర యధాసుఖం !!
యజ్ఞోపవీతం యది జీర్ణ వంతం
వేదాంత నిత్యం పరబ్రహ్మ సత్యం !
ఆయుష్యమగ్ర్యం ప్రతిముంచ శుభ్రం
యజ్ఞోపవీతం విసృజస్తుతేజః
మం. ఓం. సముద్రం గచ్ఛ స్వాహా...!

పై మంత్రం / శ్లోకాలు చెప్పి పాత యజ్ఞోపవీతాన్ని కంఠమాలవలె ధరించి శిరస్సుపై నుండి వెనుకకు అనగా వీపుపైకి తీసివేయాలి. జీర్ణ యజ్ఞోపవీతాన్ని వాసన చూసి పవిత్రమైన ప్రదేశంలోకానీ,

చెట్టుపైకానీ, ప్రవహిస్తున్న నదిలో కానీ లేదా అగ్నిలో కానీ వేయాలి.
చతుస్సాగర పర్యంతం గో బ్రాహ్మణేభ్యః శుభం భవతు ... ప్రవరాన్విత... గోత్రోత్పన్న .... శర్మ .... అహం భో అభివాదయే !!
(చతుస్సాగర ... ఇది బ్రాహ్మణులు చెప్పకొనేది)

యస్య స్మృత్యాచ నా మోక్త్యా తపస్సంధ్యా క్రియాదిషు !
న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వందే తమచ్యుతమ్ !!
మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం పరమేశ్వర!
యత్కృతంతు మయా దేవ పరిపూర్ణం తదస్తుమే !!

అనేన యజ్ఞోపవీత ధారణేన భగవాన్ శ్రీ లక్ష్మీనారాయణ ప్రేరణయా, శ్రీ లక్ష్మీనారాయణ ప్రీయంతాం వరదో భవతు.
శ్రీ కృష్ణార్పణమస్తు.

కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యా త్మనా వా ప్రకృతే స్స్వభావాత్ !
కరోమి యద్యత్సకలం పరస్మై
శ్రీమన్నారాయణాయేతి సమర్పయామి !!

అచ్యుతాయ నమః అనంతాయ నమః గోవిందాయ నమః



## ఏ సందర్భములో యజ్ఞోపవీతమును మార్చుకోవాలి ?

వామ హస్తే వ్యతీతేతు తత్ త్యక్త్వా ధారయేత్ నవం !!

అనగా ఎడమ భుజం పైనుండి జారి కింద పడిపోయినప్పుడు, ఏదైనా దారం తెగిపోయినప్పుడు,

శ్రాద్ధ కర్మాణి యజ్ఞాదౌ శశి సూర్యగ్రహేపి చ !!

అనగా శ్రాద్ధము, యజ్ఞము, సూర్య / చంద్ర గ్రహణముల అనంతరము అలాగే జాతాశౌచ (పురుడు), మృతాశౌచము (సూతకము) లు తీరిన మరుసటిరోజు, శవాన్ని తాకినా, చితిని తాకినా నూతన యజ్ఞోపవీతాన్ని ధరించాలి.

శ్రావణ పౌర్ణమి రోజున సర్వులూ నూతన యజ్ఞోపవీతాన్ని ధరించాలి.



## తిథులు - వారాలు

సంస్కృతములో తిథులు మరియు వారముల పేర్లు మరియు సంకల్పంలో చెప్పాల్సిన విధానము

ఆదివారము - భానువాసరే

సోమవారము - ఇందువాసరే

మంగళవారము - భౌమవాసరే

బుధవారము - సౌమ్యవాసరే

గురువారము - గురువాసరే

శుక్రవారము - భ్రుగు వాసరే

శని వారము - స్థిర / మంద వాసరే

1. పాడ్యమి - ప్రతిపద్యాం
2. విదియ - ద్వితీయాయాం
3. తదియ - తృతీయాయాం
4. చవితి - చతుర్థ్యాం
5. పంచమి - పంచమ్యాం
6. షష్ఠి - షష్ఠ్యాం
7. సప్తమి - సప్తమ్యాం
8. అష్టమి - అష్టమ్యాం
9. నవమి - నవమ్యాం
10. దశమి - దశమ్యాం
11. ఏకాదశి - ఏకాదశ్యాం
12. ద్వాదశి - ద్వాదశ్యాం
13. త్రయోదశి - త్రయోదశ్యాం
14. చతుర్దశి - చతుర్దశ్యాం
15. పౌర్ణమి - పౌర్ణమ్యాం
16. అమావాస్య - అమావాస్యాం



## సహృదయులైన పాఠకులకు విజ్ఞప్తి !

నా పరిజ్ఞానం వరకు పై విషయాలు సేకరించి కూర్చి రాయడం అయినది. ఏవైనా అక్షర దోషాలు లేదా అర్థ దోషాలు ఉంటే మన్నించి మా దృష్టికి తీసుకువస్తే తదుపరి ముద్రణలో సవరించగలను.

ఇంతే.....!



భవదీయుడు

**మద్దికుంట శ్రీకాంత్ శర్మ**

**మా ఇతర ప్రచురణలు:**

1. షష్టి పూర్తి విధి గురించి తెలుసుకుందాం

2. మహా శివరాత్రి పూజావిధానం.

**సశాస్త్రీయ ముహూర్తములకు - వైదిక కార్యములకు -**
**జాతక సమస్యల నివారణలకు,**
**నవరత్న ధారణా విషయాలకు మరియు**
**సశాస్త్రీయ గృహ ప్రవేశములకు సంప్రదించగలరు.**


**శ్రీకాంత్ శర్మ,**

**హిందూ ధర్మ చక్రం**

మా వాట్సప్ : 9849485645

**Please follow us on:- youtube.com/hindudharmachakram**
**facebook.com/hindudharmachakramHDC**


దేవతా ఆరాధన ఎక్కువ చేయండి !

గోసేవ చేయండి, పేదలకు సహాయం చేయండి.

! ధర్మస్య విజయోస్తు !

!! గో బ్రాహ్మణ ఏభ్యః శుభమస్తు నిత్యం

లోకాః సమస్తాః సుఖినో భవంతు !!